

దీపాలంకరణ—1959 వ సం॥ ఆగస్టు 15 వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంలో హైదరాబాదు-సికింద్రాబాదు స్విమ్మింగ్ అసోసియేషన్ వద్ద గంటస్తంభం, నౌబత్ పహాడ్‌లు ఉజ్వలంగా అలంకరించబడ్డాయి.



స్వాతంత్ర్య దినోత్సవాన దీపాలంకృతమయిన శాసన సభా మందిరం (హైధరాబాదు).

# ఆంధ్ర ప్రదేశ్

సెప్టెంబరు, 1959

సంపుటి 3 | సంచిక 11

ఆశ్వయుజము, శకము—1881

విషయ సూచిక



ముఖచిత్రం

1959 వ సం॥ ఆగస్టు 18 వ తేదీన శ్రీశైలంలో రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్.

చందా వివరాలు :

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | ... | 2 రూపాయల 16 నయా పైసలు |
| విడి ప్రతి వెల | ... | 18 నయా పైసలు |

Edited and Published by the Director of Information and Public Relations, Hyderabad:
Printed by the Director of Printing, Andhra Pradesh, at the Government Press, Kurnool.

# నవభారతం

కవిసామ్రాట్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

నవ భారత నిర్మాణంలో
ఎవరెవరిది ఎంతటి పాలో
ప్రతి పౌరుడు యోచించాలీ
ప్రతి గ్రామం ఘోషించాలీ.

తమ జీవితమే అంకితమై
తమచేసిన త్యాగంఫలమై
మన పెద్దలు తెచ్చిన రాజ్యం
మన కందరికి అనుభోగ్యం.

జన సందోహం మన వెనుకై
మన మందరమూ ముందడుగై
నవజీవనమే తోణికిస్తాం
నవ భారతమే సృష్టిస్తాం.

గణతంత్రపు రాజ్యంలో, ఏ
జనపక్షం పరిపాలిస్తే
మనకేమీ—మనదొక పక్షం
జన సౌకర్యమ్మే లక్ష్యం.

నవ భారత నిర్మాణంలో
ఎవరెవరిది ఎంతటి పాలో
ప్రతి పౌరుడు యోచించాలీ
ప్రతి గ్రామం ఘోషించాలీ.



# రాష్ట్రపతి ఆగమనం

రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ ఆగష్టు 19 న శ్రీశైలం ప్రాజెక్టును దర్శించి ఆ ప్రాజెక్టు త్వరలో మంజూరు కావటానికి కృషిచేయగలమని హామీ ఇచ్చారు. ఆయన యీ రాష్ట్రంలో ఆగష్టు 14 నుంచి 24 వరకు మొత్తం 11 రోజులు ఉన్నారు. ఆ రోజులలో మన రాష్ట్రాన్ని పులకాంకితంచేసిన మధుర ఘట్టాలలో ఇది ఒకటి.

“స్వతంత్ర భారత దేశంలో గడచిన 12 సంవత్సరాలలోను సంతోషించతగ్గ పనులు జరిగాయి. వాటిలో కొన్ని లోపాలుండవచ్చు. కాని అవి మనకు భవిష్యత్తును ఆశాజనకం చేస్తున్నవి.” అని భారత స్వాతంత్ర్య 12 వ వార్షికోత్సవం సందర్భములో సికిందరాబాదు పెరేడ్ మైదానంలో సైనిక, విమానదళ, రాష్ట్ర పోలీసు, ఎన్. సి. సి. కేడెట్ల పెరేడ్‌లో వందన స్వీకారంచేస్తూ రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ అన్నారు.



1959 వ సం॥ ఆగష్టు 14 వ తేదీన గౌరవ వందన స్వీకారానికై రాష్ట్రపతి సికింద్రాబాదు రైలు స్టేషనునుంచి యువతలకు వస్తున్న దృశ్యం.

స్వాతంత్ర్యాన్ని పటిష్టం చేసుకోటానికి అనేకమైన సాధకబాధకాలను, చిక్కులను ఎదుర్కోవలసి వచ్చింది. పేదరికము, నిరక్షరాస్యత, వ్యాధులనుంచి దేశానికి ఇంకా విముక్తి లభించలేదు. ఈ అనర్థాలను సాధ్యమైనంత శీఘ్రంగా రూపుమాపటానికి సర్వశక్తిని ధారపోయవలసివుంది. ఇందునిమిత్తం ప్రభుత్వం వివిధ ప్రణాళికలను, ప్రాజెక్టులను అమలు పరుస్తున్నది. వాటిలో కొన్ని ఫలోన్ముఖమయినవి, మరి కొన్ని కొత్త ప్రణాళికలు తయారవుతున్నవి. ప్రజలనుంచి సంతృప్తికరమైన సహకారంలభిస్తే భవిష్యత్తు చక్కగా ఉండగలదు. ఉద్యోగావకాశాల వృద్ధికై పెద్ద ప్రాజెక్టులు, భారీ పరిశ్రమలేకాక కుటీరపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమలుకూడా చేపట్టబడుతున్నాయి. ఐతే, ప్రస్తుతావసరం ఆహారోత్పత్తి. మన దేశంలో విభిన్నమైన శీతోష్ణస్థితి, భూములు ఉన్నవి కాబట్టి ఆహారంలో మనం స్వయంసమృద్ధిని సాధించటం తథ్యం.



రాష్ట్రపతి పెరేడ్‌లో ప్రసంగిస్తున్నారు.

కష్టపడి సాధించిన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోటానికి ప్రజలు దేశంపట్ల తమకుగల కర్తవ్యాన్ని నెరవేర్చాలని ఆయన ఉద్బోధించారు. పూర్వం అంతఃకలహాలవల్లనే భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయినదన్నాడు. దేశీయులు కృతనిశ్చయంతో తమ దౌర్బల్యాలను జయించి తిరిగి స్వాతంత్ర్యాన్ని సాధించారనీ, అది అమూల్యమైనదనీ అన్నారు. ఆయన ఇంకా ఇలా అన్నారు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి పన్నెండు సంవత్సరాలైంది. సాధించిన

ప్రభుత్వం ఎక్కువ బాధ్యతలను చేపడుతున్నది. అలాగని ప్రజలు తృప్తిపడి వూరుకోరాదు. ప్రభుత్వ ప్రయత్నం ఫలించాలంటే ప్రజలు కష్టించి పనిచేయాలి. వివిధ ప్రణాళికలు, కార్యక్రమాలు అమలులో ధనిక, పేద, చిన్నా పెద్దా తారతమ్యంలేకుండా ప్రజలంతా ప్రభుత్వంతో సహకరించాలి. అందరిలోనూ గల అనేక లోపాలు సరిదిద్దబడాలి. ప్రతి ఒక్కరు తమతమ లోపాలను సరిదిద్దుకొంటేనే అది సాధ్యపడుతుంది.

## భిన్నత్వంలో ఏకత్వం

భారత దేశంలో అనేకమైన భాషలు, మతాలు వున్నాయి. వాటన్నిటిలో ఏకత్వం సాధించటం సులభంకాదు. కాని ప్రజల వివేకం, పరస్పర అవగాహనల కారణంగా ఏకత్వం సాధించ

జరిగింది. ఇది జాతి నిర్మాణానికి వినియోగించబడుతుందని ఆశిస్తాను.

రాష్ట్రపతి రక్షణదళ సభ్యులవైపుతిరిగి భారత సైన్యం త్యాగ నిరతి, కర్తవ్యపరాయణత, ధైర్య సాహసాలతోకూడిన గొప్ప సాంప్రదాయాన్ని నెలకొల్పినదని జ్ఞాపకం చేశారు. దేశ రక్షణకు సైన్యం కంకణం కట్టుకుని, కష్టించి పనిచేయటానికి ప్రజలు నడుం కట్టుకొనటంతో నిజానికి దేశభవిష్యత్తు ఉజ్వలంగా ఉండగలదని అంటూ ఆయన తమ ప్రసంగాన్ని ముగించారు.

రాష్ట్రపతి ప్రసంగాన్ని అసంఖ్యాకులైన సభికులు విన్నారు. ఆ సందర్భంలో సతీసమేతులైన గవర్నరు శ్రీ భీమసేనసచార్, ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి, శాసన సభ అధ్యక్షుడు శ్రీ ఏ. కాశేశ్వరరావుగారలు హాజరయారు.

రాష్ట్రపతి దక్షిణదేశపు ముఖ్య కార్యస్థానం రాష్ట్రపతి నిలయంలో పదిరోజులు ఉండటానికి ఆయన ఆగష్టు 14 ఉదయం హైదరాబాదు నగరానికి విచ్చేశారు.

## బాలభట ఉద్యమం పాత్ర

రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ ఆగష్టు 16 సాయంకాలం గాంధీభవన్ ఆడిటోరియంలో భారత బాలభటులు, గైడ్‌ల విన్యాసంలో ప్రసంగిస్తూ బాలభటులు, గైడ్‌ల ఉద్యమం యువకులలో సత్ప్రవర్తన సాధించటంలో కృతకృత్యమైనదని ప్రశంసించారు.

భారత దేశంలో ఈ ఉద్యమం బాగా వర్ధిల్లినదనీ, ఈ విషయంలో యువకులు చాల ఉత్సాహంతో పనిచేశారని ఆయన అన్నారు. ఆయన ఇంకా ఇలా అన్నారు. ఈ ఉద్యమం సరైన పంథాలో నడుస్తున్నందుకు సంతోషంగా వుంది. బాలభటులు, గైడ్‌లు నేర్చుకున్న శిక్షణ వారి వ్యక్తిగత జీవితాలకు ఉపకరించటమేకాక, సత్ప్రవర్తనకుకూడా వరవడి దిద్దుతుంది. వారు ఎదిగిన తరువాత మేలిరకం సంఘాన్ని నిర్మిస్తారు.

ఆ తరువాత రాష్ట్రపతి చక్కని జానపద నృత్యం వగైరా కార్యక్రమాలను తిలకించారు.



బాలభటులు, గైడులతో రాష్ట్రపతి (1959 వ సం॥ ఆగష్టు 16 వ తేదీన హైద్రాబాదులో జరిగిన రాలీ సందర్భంలో.)

## సర్వోదయ కార్యకర్తల పాత్ర

ఆగస్టు 16 న రాష్ట్రపతి బొలారంలోని సాధనమందిరంలో ఆంధ్ర ప్రదేశ్ ద్వితీయ సర్వోదయ సమావేశాన్ని ప్రారంభించారు.

ప్రస్తుతం కేంద్రీకరణవైపు మొగ్గుతున్న ఆలోచనలను అరికట్టి సంఘంలో వ్యక్తిత్వాన్ని అణగారొక్కకుండా చూడటానికి సర్వోదయ కార్యకర్తలు కృషిచేయవలసి ఉందన్నారు.



రాష్ట్రపతి పెరేడ్‌ను చూస్తున్నారు.

ఈ విషయాన్ని విపులీకరిస్తూ ఆయన ఇలా అన్నారు. ఈ మధ్య ప్రజలు స్వయంపోషక అలవాటును పోగొట్టుకుంటున్నారు. వారు క్రమేణా ప్రభుత్వంపైన, తదితరులపైన ఆధారపడుతున్నారు. ఇదివరలో స్వయంగా ప్రజలు పూనుకున్న కార్యకలాపాలెన్నో ఇప్పుడు ప్రభుత్వంద్వారా జరుగుతున్నాయి. ఉదాహరణకు, పూర్వం ఏదైనా చెరువు ఎండిపోతే ప్రజలు మరమ్మతు చేసుకునేవారు. కాని ఇప్పుడు నీటి పారుదల ప్రాజెక్టులు వారికి ఎడతెగకుండా నీటిని సరఫరా చేస్తున్నాయి. ఇప్పుడు మనుష్యుల పనిని ఆధునిక గాడ్‌గెట్‌లు చేస్తున్నాయి. ప్రజలు తమ ఇళ్లలో ఆఖరికి అన్నం వండుకొనటంకూడా మానివేసేకాలం వస్తుందేమో తెలియదు. ప్రపంచమంతటాకూడా విషయాలు అధికార కేంద్రీకరణవైపు నడుస్తున్నాయి. ఈ పరిస్థితులలో మన దేశం ఆ తాకిడినుంచి తప్పించుకొనడం కష్టం. అయినప్పటికీ దేశంలో వికేంద్రీకరణ, వ్యక్తి పూనికలకు స్థానం వుంది. ఈ సందేశాన్ని సర్వవ్యాప్తం చేయటానికి సర్వోదయ కార్యకర్తలు మిక్కిలి తగివుంటారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు. దేశాన్ని అనేక సమస్యలు ఎదుర్కొంటున్నవి. కష్టపడి సాధించిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొనటానికి వాటికేదో ఒక పరిష్కారమార్గాన్ని చూడాలి. ఈ సమస్యల పరిష్కారంలో ప్రభుత్వం పెద్దపాత్ర వహిస్తుంది. ఆకారణంగా స్వాతంత్ర్య సముపార్జనకుముందు యీ సమస్యలలో ఆసక్తిగల కార్యకర్తలు చాలమంది ఇప్పుడు వాటివిషయంలో పనిచేయటం మానివేశారు. తమ ప్రభుత్వం తమ మంచిచెడ్డలను చూస్తున్నది కాబట్టి తాము పనిచేయటం లేదని చెబుతున్నారు. ఇటువంటి అభిప్రాయంతో నేను ఏకీభవించలేను. స్వయం పోషక అలవాటును ఏవిధంగానూ పోగొట్టుకోకూడదు. అనేకమైన సాంఘిక, ఆర్థిక సమస్యల పరిష్కారంలో ప్రజలు, ప్రజా నాయకులు ప్రభుత్వంతో సహకరించాలి.

వ్యక్తి స్వతంత్రత కలిగివుండి ఒకరిపై ఆధారపడనప్పుడే అది నిజమైన ప్రజాస్వామ్యం కాగలదు. వ్యక్తి ఒక యంత్రాంగంలో భాగంకావాలా లేక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలా అన్నదే ఇప్పుడు ప్రశ్న. సంఘంలో వ్యక్తి ప్రత్యేకతను లుప్తంచేసే పద్ధతి ఒకటి, ఉంది. ఈ రెండిటిలోను ఏదికావాలో మనం నిర్ణయించుకోవాలి. నా అభిప్రాయం ప్రకారం సంఘం, వ్యక్తి వహించవలసిన పాత్రల మధ్య సరయిన ఒక హద్దును ఏర్పరచాలి. ఈ ఆశయసిద్ధి కనువుగా ప్రజాభిప్రాయాన్ని మలచటం సర్వోదయ కార్యకర్తల అవశ్య కర్తవ్యం.

## మందుల కర్మాగారాలు

ఆగష్టు 17 న రాష్ట్రపతి హైద్రాబాదులోవున్న నిరోధక వైద్య సంస్థలో రాజేంద్ర ప్రసాద్ బ్లాకు భవనాలకు ప్రారంభోత్సవం చేశారు. ప్రజల ఆరోగ్య ప్రమాణాలను కాపాడటానికి దేశంలో అధునాతనరకాల మందులను తయారుచేసే కర్మాగారాలు, వైద్య



పెరేడ్‌లో వందన స్వీకారం చేస్తున్న రాష్ట్రపతి.




1959 వ సం॥ ఆగష్టు 19 వ తేదీన రాష్ట్రపతి శ్రీశైలంలో తిరుమల - తిరుపతి దేవస్థానం ధర్మశాలకు శంకుస్థాపన చేశారు.

పరిశోధన లేబొరేటరీలు అధిక సంఖ్యలో ఉండటం అవసరమని ఆయన నొక్కి వక్కాణించారు.

"రాజేంద్ర ప్రసాద్ బ్లాకు"లో పై వైద్య సంస్థయొక్క వివిధ లేబొరేటరీ విభాగాలు ఉంటాయి. అవి రాష్ట్రానికి అవసరమైన టీకాల మందులన్నిటిని సరఫరా చేస్తాయి.

రాష్ట్రపతి తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఇలా అన్నారు. భారతదేశం కోట్లాది జనాభాగల మహాదేశం. ప్రజలలో చాలమంది అనారోగ్యంతో బాధపడుతూ ఉంటారు. కాబట్టి పథకాల అమలులో ఆలస్యం జరుగుతుంది. ఈ సమస్యను రెండు విధాల పరిష్కరించటానికి శక్తి వంచనలేకుండా ప్రయత్నించబడుతున్నది. ఒకవైపున ప్రజల జీవన పరిస్థితులను చక్కచేసి తద్వారా వారి ఆరోగ్యాభివృద్ధికై కృషి చేయబడుతున్నది. మరోవైపున సాధ్యమైన మేరకి వైద్య సౌకర్యాలు కల్పించబడుతున్నాయి.

50 సంవత్సరాల క్రితం ప్లేగువంటి అంటువ్యాధులు భీతావహంగా ఉండేవి. ఇప్పుడు అవి అదుపులోనికి తేబడినవి. అలాగే మలేరియా, కలరావంటి వ్యాధులుకూడా అదుపులోనికి తేబడుతున్నవి. త్వరలోనే మనదేశంలో మనకు కావలసిన మందులన్నీ తయారు కాగలవనీ, అప్పుడు ప్రస్తుతం దిగుమతులపై వెచ్చించబడే కోట్లాది రూపాయలు ఆదాకాగలవనీ ఆశిస్తున్నాను.

ఆధునికవైద్యంలో రోగనిదానము, రోగలక్షణశాస్త్ర లేబొరేటరీలు, రోగనిరోధక చికిత్స చాల అవసరం. కొన్ని వ్యాధుల నివారణకు ఇతరదేశాలు కనిపెట్టిన పద్ధతులు, సౌకర్యాలు అవసరం కాగలవు. కాని వ్యాధినివారణకవసరమైన మందులు, సేరా, టీకాలమందులను సరఫరా చేయటానికి తగిన సాధన సంపత్తి ప్రతి రాష్ట్రానికి ఉండాలి. లోతుక్కువలను భర్తీచేయడానికై ప్రాంతీయ లేబొరేటరీల సంఖ్య హెచ్చించబడుతున్నది. ఈ రోజులలో డాక్టర్లు రోగాన్ని మామూలుగా నిర్ధరించలేరు. అందుకు వారికి లేబొరేటరీలు, వైజ్ఞానిక పరికరాలు, శిక్షణపొందిన సిబ్బంది అవసరం. ఇవిలేని వైద్యసౌకర్యాలు పరిపూర్ణమైనవి కావు. కాబట్టి సాధ్యమైనంత విస్తృతంగా నిరోధక, నివారణ చికిత్సలు రెండిటికి వసతి కల్పించబడాలి. దేశానికి బహుసంఖ్యాకమైన లేబొరేటరీలు అవసరమై ఉన్నాయి. ఆంధ్ర ప్రదేశ్ యీ విషయంలో స్వయం సమృద్ధిసాధనకు పూనుకున్నందుకు నాకు సంతోషంగా ఉంది.

## శ్రీశైలం ప్రాజెక్టు

రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ ఆగష్టు 19 సాయంకాలం సంకల్పించిన శ్రీశైలం ఆనకట్ట ఆకృతి రచించబడిన కొండ ప్రాంతానికి వెళ్ళారు. ఆయనవెంట రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన



మార్కండేయ విజయంలో ఒక దృశ్యం: రాష్ట్రపతి ఆగమనాన్ని పురస్కరించుకుని 1959 వ సం॥ ఆగష్టు 18 వ తేదీన శ్రీశైలంలో నాటక ప్రదర్శన యివ్వబడింది.

సచార్, శ్రీమతి లలితా సచార్‌లు ఉన్నారు. ఆనకట్ట ఆకృతి కొండవాలుపై రచించబడింది. నీటి పారుదల శాఖామంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. పి. పాయ్, ఐ. సి. ఎస్., విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు చీఫ్ ఇంజనీరు శ్రీ అబ్దుల్ కాదర్‌గారలు రాష్ట్రపతికి స్వాగతం చెప్పారు.

"కృష్ణానదిపై తలపెట్టిన శ్రీశైలం ప్రాజెక్టుకు అంత ఎక్కువ ఖర్చుకాదు, కాని కృష్ణానది నీటిని శ్రీశైలం, నాగార్జున సాగర్‌లు రెండిటివద్ద కూడా నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రయోజనాలకు వినియోగించుకోటానికి అది మిక్కిలి ముఖ్యం." అని రాష్ట్రపతి అన్నారు.

శ్రీశైలంలో ప్రాజెక్టు స్థలంవద్ద ప్రాజెక్టు వివరాలను గురించి గవర్నరు, ముఖ్యమంత్రులతో చర్చించే రాష్ట్రపతి ఇంకా ఇలా అన్నారు. ఈ ప్రాజెక్టు ప్రాముఖ్యం దృష్ట్యాను, ఆచరణలో దానికి సంబంధించిన అంశాల దృష్ట్యాను కేంద్రప్రభుత్వంతో చెప్పి యిది త్వరలో మంజూరు కావటానికి తోడ్పడతాను.

ఈ ప్రాజెక్టుకు దగ్గరగా రూ. 34 కోట్లు ఖర్చు కాగలవని భావింపబడుతున్నది. దీనివల్ల 5,50,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. 3·5 లక్షల ఎకరాలకు నీటి పారుదల లభిస్తుంది.

ముఖ్యమంత్రి, నీటి పారుదల మంత్రి, చీఫ్ ఇంజనీరులు వాల్ మ్యాపులు, స్కెచ్‌లు, ఛాయా చిత్రాలద్వారా రాష్ట్రపతికి సంకల్పించిన ప్రాజెక్టు స్వరూపాన్ని విశదీకరించారు.

ప్రాజెక్టుకి సంబంధించిన వివరాలను చర్చిస్తూ రాష్ట్రపతి అక్కడ రమారమి ఒకగంట ఉన్నారు. తరువాత ఆయన తిరిగి శ్రీశైలం వెళ్ళి అక్కడ ఒక సాంస్కృతిక ప్రదర్శనను తిలకించారు.

ఆయన ఆగష్టు 19 ఉదయం శ్రీశైల దేవాలయాన్ని దర్శించి అక్కడ రమారమి 45 నిమిషాలు గడిపారు.

## దేశ ఐకమత్యము

ఆగస్టు 19 న రాష్ట్రపతి శ్రీశైలంలో తిరుమల-తిరుపతి దేవస్థానం నిర్మించబోయే సత్రానికి శంకుస్థాపన చేశారు. భారతీయ సంస్కృతిలోను, ఆధ్యాత్మిక భావసంపదలోను ఐక్యత వున్నదనీ, భారతదేశంయొక్క ఆమూలాగ్ర ఐక్యతను ప్రజలు పరిరక్షించాలని ఆ సందర్భములో ఆయన విజ్ఞప్తి చేశారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు.—శ్రీశైలం దర్శించాలని చెప్పగానే అందుకు వెంటనే సమ్మతించాను. అందువల్ల ఒక క్రొత్త స్థలాన్ని చూడటమేకాక ప్రసిద్ధమైన యిక్కడి దేవాలయంలో పూజా పునస్కారాలుకూడా చేయవచ్చు. ఉదయం దేవాలయ పరిసరాలను చూశాను. దేవాలయం, దాని పరిసరాలు బహు శ్రద్ధగా బాగుచేయబడుతున్నవి. ఈ శ్రద్ధ, యీ విషయంలో ముఖ్యమంత్రి చూపిస్తున్న ఉత్సాహము నా మనస్సులో హత్తుకుపోయాయి. వైభవోపేతమైన ప్రాచీన చెక్కడాలు, శిల్పకళ నన్ను ఆశ్చర్యచకితుని చేశాయి. వాటి నిర్మాణానికి అసాధారణమైన ఇంజనీరింగు నైపుణ్యం అవసరం. ఈ దేవాలయం నిర్మించబడి కనీసం వెయ్యి



1959 వ సం॥ ఆగస్టు 15 న తేదీన రాష్ట్రపతికి సంకల్పించిన శ్రీశైలం ప్రాజెక్టు వివరాలు తెలియచేయబడుతున్నాయి.

సంవత్సరాలు అవుతుంది. ఇది యీ వెయ్యి సంవత్సరాలలోను అలనా పాలనా లేకపోయినా ఒడిదుడుకులను తట్టుకొని యిలా నిలబడివున్నదన్న సంగతిని మనం మరచిపోకూడదు. ఇప్పుడు మనం నిర్మించే పెద్ద కట్టడాలన్నీ అలనా పాలనాలేకుండా ఇందులో పదవ వంతు కాలమైనా ఉంటాయాఅని నాకు ఆశ్చర్యంగా ఉంది.

భౌతిక సుఖాలకు తగిన సౌకర్యాలు ఉండవలసినదే. అవి వాంఛనీయమైనవేకాక అవసరమైనవి కూడా. జీవన పరిస్థితుల అభివృద్ధికి శతధా ప్రయత్నించవలసినదే. కాని మనకు శక్తినిచ్చేది ఆధ్యాత్మికవిశ్వాసమన్న మాటను గుర్తుంచుకోవాలి. ఆ విశ్వాసమే భారతదేశానికి గర్వకారణమైనది. ఆ విశ్వాసమే హిమాలయాల నుంచి కన్యాకుమారి వరకూ, సోమనాథ్ నుంచి జగన్నాథం వరకు యీ మహాదేశంలో నివసించే ప్రజలలో ఐకమత్య సాధనకు తోడ్పడింది. భారతదేశం సంస్కృతిలో వేరుబారిన ఆమూల ఐక్యతను ఆఖరికి విదేశ పాలనకూడా ఛేదించలేకపోయినది.

దేశంయొక్క యీ మూల ఐక్యతకు భంగంకలిగే రోజులు వచ్చాయి. రాజకీయ ఐక్యత యిటీవలనే సాధించబడినా మూల ఐక్యత యిదివరకే వున్నదని మనం జ్ఞాపకం వుంచుకోవాలి. ఆ మూల ఐక్యత యీ దేశీయుల సంస్కృతి, ఆధ్యాత్మిక భావసంపదలలో ప్రతిబింబిస్తున్నది. స్వాతంత్ర్య సముపార్జన పిమ్మట ప్రజలలో దైవచింతన కలిగిన సూచనలు కనబడుతున్నాయి. ఇందుకు నాకు సంతోషంగా ఉంది. తిరుమల-తిరుపతి దేవస్థానం ఆదాయం అసాధారణంగా హెచ్చిపోయింది. ప్రజల దైవచింతనకు ఇది ప్రబల నిదర్శనం.



1959 వ సం॥ ఆగష్టు 19 వ తేదీన రాష్ట్రపతి శ్రీశైల దేవాలయాన్ని సందర్శించారు.

## పోలీసుల కర్తవ్యం

పోలీసులు వైద్యుల వైఖరిని అవలంబించాలని ఆగష్టు 19 న కర్నూలులో పోలీసు దళ సభ్యులకు రాష్ట్రపతి విజ్ఞప్తి చేశారు. వైద్యుడు శస్త్రచికిత్స చేసేటప్పుడు రోగికి బాధ కలుగుతుంది. కాని ఆ పని రోగి ఆరోగ్యాన్నాశించి చేయబడుతున్నది. అలాగే పోలీసుల మనస్సులో వ్యక్తి శ్రేయస్సు, సంఘ శ్రేయస్సు స్థానమేర్పరుచుకోవాలి. ఈ విధంగానే మన పోలీసులకు శిక్షణ ఇవ్వాలనుకుంటాను.

బళ్లారి రోడ్డుపై రాష్ట్ర ప్రత్యేక పోలీసు సిబ్బందికి నిర్మించబడిన 400 నివాస గృహాలను ప్రారంభిస్తూ రాష్ట్రపతి పై విధంగా అన్నారు. ఆ సందర్భంలో కర్నూలులో నేత్రోత్సవమైన ఉత్సవం ఏర్పాటు చేయబడింది. ఆకర్షణీయమైన ఆ ఉత్సవానికి గవర్నరు కూడా హాజరయారు.

నాగరిక దేశాలన్నిటికి పోలీసులు చాల ముఖ్యమని, వారు విధిగా చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయని రాష్ట్రపతి అన్నారు. ప్రభుత్వం వారి జీవితాలు సుఖప్రదం కావటానికి సాధ్యమైనన్ని సౌకర్యాలను కల్పించాలని, అప్పుడు వారు ఆందోళన లేకుండా తమ కర్తవ్యాన్ని నెరవేర్చ గలుగుతారని అన్నారు.

## సమూలమైన మార్పు

తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ రాష్ట్రపతి యింకా యిలా అన్నారు. ప్రస్తుతం మన దేశంలో అందరికంటె పోలీసులు చేయవలసినదే చాలా ముఖ్యమైన పని. మన దేశంలో బ్రిటిషు వారు వున్నప్పుడూ పోలీసులు వున్నారు. నేరాలను పట్టుకొనడానికి, శాంతి రక్షణ మున్నగు పనులకి యిప్పుడూ వారి అవసరం వుంది. అవన్నీ యించుమించు పూర్వంవలెనే యిప్పుడూ వున్నాయి. ఐతే యిప్పుడు సమూలమైన ఒక్క మార్పు మాత్రం వచ్చింది. పోలీసులు అసంతోషకరమైన పనులను చాలాచేయాలి. వారు ప్రజలందరి మంచిని ఆలోచించటమేకాక వారి పట్ల నిష్పక్షపాతంగా న్యాయంగాకూడా ప్రవర్తించాలి. ప్రజలు ఎవరి యిళ్లలో వారుండి ఎవరి దినచర్యలను వారు చూచుకుంటున్నప్పుడు వారికి ఏ విధమైన ఆందోళన లేకుండా వుండేట్టు పోలీసులు చూడాలి. ఇదంతా జరగాలి. కాని నేను సూచించే సమూలమైన మార్పు ఏమంటే పోలీసులు వైద్యులవైఖరి నవలంబించాలి. వైద్యుడు వ్యక్తి ఆరోగ్యాన్ని కాపాడుతాడు. అతడు ఒక్క రోగి జబ్బును కుదర్చటమేకాదు, అది పిల్లలకు అంటకుండాకూడా జాగ్రత్త వహిస్తాడు. అలాగే పోలీసులుకూడా నేరస్తుని శిక్షిస్తూ, సంఘంలో యితరులు నేరాలు చేయకుండా చూడాలి. ఐతే అది వారొక్కరి పైనే ఆధారపడిలేదు. సంఘంకూడా సహకరించి యీ ఆశయ సిద్ధికి తన వంతు పాత్రను నిర్వహించాలి.

పోలీసులు తాముకూడా మనుష్యులమే అన్న విషయాన్ని జ్ఞాపకం వుంచుకొని యితరులతో వ్యవహరించేటప్పుడు మానవ దృక్పథంతో మెలగాలి. ఈ భావనలోనే మన పోలీసులకు శిక్షణ యివ్వాలని నేననుకుంటున్నాను. సంఘం పోలీసుల దెబ్బలపైకాక వ్యక్తి వివేకంపై ఎక్కువ ఆధారపడవలసి వుంటుంది. మిక్కిలి తక్కువ అధికారం చెలాయించే ప్రభుత్వం వుత్తమోత్తమ మైనదన్నమాట నిజం. పోలీసులు, సైన్యం లేక మరొకరి బలవంతం లేకుండా ఆత్మ నిగ్రహంతో ప్రవర్తించడానికి ప్రతి వ్యక్తి ప్రయత్నించాలి. ఇది చాలా మంచి ఆదర్శమేకాని పెద్ద ఆదర్శంకూడా. దానిని సాధించటం కష్టమే. కాని లౌకిక వ్యవహారాలలోకూడా అటువంటి వున్నతాదర్శం వుండటం మంచిది. ఏమాత్రం ప్రయత్నించినా యీ విషయంలో మనం చక్కని ఫలితాలను సాధించగలం.

తమ ప్రసంగాన్ని ముగిస్తూ ఆయన యిలా అన్నారు. ఈ దేశంలో జీవితం అన్ని శాఖలలోను సమర్థు లందరి పని మనకు కావాలి. పోలీసు శాఖ ముఖ్యాతిముఖ్యమైన శాఖ. ప్రభుత్వం కల్పించే సౌకర్యాల విలువ గుర్తించబడుతుందనే నమ్మకము, యీ సౌకర్యాలు పొందినవారు సత్కృషి రూపంలో ప్రభుత్వానికి చక్కని ప్రతిఫలం అందజేస్తారనే నమ్మకము నాకు వున్నాయి.

రాష్ట్రపతికి ముఖ్యమంత్రి స్వాగతం చెప్పారు.



కర్నూలులో సాయుధ రిజర్వు పోలీసు కాలనీ దృశ్యం (1959 వ సం॥ ఆగష్టు 19 వ తేదీన రాష్ట్రపతి దీనిని ప్రారంభించారు.)

## తెలుగు విజ్ఞాన శాస్త్ర అకాడమీ

ఆగష్టు 21 న హైదరాబాదు జూబ్లీ హాలులో రాష్ట్రపతి తెలుగు విజ్ఞానశాస్త్ర, చరిత్ర అకాడమీని ప్రారంభించారు

హిందీకి, ప్రాంతీయ భాషలకు వైరుధ్యం లేదని, రాష్ట్రాలలో ప్రాంతీయ భాషలు అధికార భాషలు చేయబడినప్పుడు హిందీని భారతదేశ అధికార భాషగాచేసే విషయంలో ఆచరణ పూర్వకమైన ఒప్పందాన్ని చేసుకోవచ్చుననీ ఆయన అన్నారు

ఆయన యింకా యిలా అన్నారు అసలు వైరుధ్యం హిందీకీ, ఇంగ్లీషుకీ మధ్య వుంది. ఇంగ్లీషును వర్జించాలని చెప్పను కాని స్వతంత్రమైన దేశం ఏదీకూడా పరిపాలనా వ్యవహారాలకి విదేశ భాషపై కాలనిర్ణయము లేకుండా ఆధారపడలేదు దేశంలో ఐక మత్య సాధనకి సంస్కృతం స్థానాన్ని హిందీ ఆక్రమించుకొనే రోజులు రాగలవు

బోధనా భాషవల్ల జ్ఞానం వృద్ధికావటమేకాక వివిధ విషయాలలో వున్నత ప్రమాణాల నందుకొనటం కూడా సాధ్యపడుతున్నది విశ్వ విద్యాలయ ఘట్టంవరకూ భారతీయ భాషలు బోధనా భాషలుగా వుండాలని ప్రభుత్వం నిర్ణయించటంలో ఆశ్చర్యం లేదు. ఇందువల్ల వివిధ భాషలలో సారస్వతం అభివృద్ధి చెందుతుంది సాంకేతిక పదజాలం తయారీలో ఏ ఒక్కపదానికీ తగని ప్రాముఖ్యమివ్వ నవసరంలేదు "బ్రెయిన్" ఇంగ్లీషు పదమే. ఐనా అది బాగా నలిగిన మాట కనుక భారతీయ భాష లన్నిటిలోను దానిని వుంచుకోవచ్చు అలాగే ఆక్సిజన్ వంటి పదాన్నికూడా విడనాడ నవ సరంలేదు బాగా అర్థమయ్యే ప్రస్తుత పదాలకు బదులు కొత్త పదాలను తయారు చేయటంవల్ల యేమీ లాభంలేదు ఈ విషయాలన్నిటిలోను చక్కని మధ్యే మార్గాన్ని అవలంబించి దేశం మొత్తంమీద మిక్కిలి అనువుగా వుపయోగకరంగావుండే పదాలను మార్చకుండా వుంచుకోవలసి వున్నది.

రాష్ట్రపతి అకాడమీ కొత్త ప్రచురణలు మూడింటిని విడుదల చేశారుకూడా

## విద్యావిధానం సంస్కరణ

ఆగష్టు 21 న రాష్ట్రపతి హైదరాబాదులో ఎగ్జిబిషన్ క్లబ్బులో ఉస్మానియా పట్టభద్రుల సంఘం 27 వ వార్షిక సమావేశాన్ని ప్రారంభించారు

"మనిషికి చేపట్టిన పనికితగిన అర్హతనిచ్చేది యేదో అదే నిజమైన విద్య. విద్యార్థులను పనికి తగినవారుగా తయారు చేయాలి అందుకవసరమైన సర్దుబాట్లు జరగాలి" అని రాష్ట్రపతి అన్నారు ఆయన ఇంకా ఇలా అన్నారు ఉన్నతవిద్య అభ్యసించినవారిలో ఇంకా చాలామందికి ఉద్యోగాలు లేకపోవటము, వారికి తాత తండ్రులుచేసిన పనులపట్ల నిర్లక్ష్యము, అసహ్యము కూడా ఉండటము విచారకరం.



1959 వ సం॥ ఆగష్టు 16 వ తేదీన రాష్ట్రపతి బొలారంలో ఆంధ్ర ప్రదేశ్ సర్వోదయ సమ్మేళనంలో ప్రసంగించారు.



అమెరికా వ్యాపార ప్రతినిధి వర్గ సభ్యులతో రాష్ట్రపతి (1959 వ సం॥ ఆగష్టు 15 వ తేదీన జూబ్లీ హాలులో.)



1959 వ సం॥ ఆగష్టు 21 వ తేదీన హైదరాబాదు జూబ్లీ హాలులో రాష్ట్రపతి తెలుగు విజ్ఞాన శాస్త్రి, చరిత్ర అకాడమీని ప్రారంభించారు.

మన విద్యావిధానంలో ఏదో లోపం వుందనిపిస్తుంది. గత 50 సంవత్సరాలలోను ఇప్పుడు మన పాఠశాలలు, కళాశాలల్లో నేర్పేరకం విద్య బాగా హెచ్చుతున్నదనటంలో సందేహం లేదు నా చిన్నతనంలో మా ప్రాంతం (బీహారు) లో నాలుగయిదు కళాశాలలు మాత్రం వుండేవి ఇప్పుడు ఇంచుమించు 120 ఉన్నాయి. ఇదే సిద్ధాంతమైతే విద్యారంగం బ్రహ్మాండంగా విస్తరిల్లినదనడంలో సందేహంలేదు ఎక్కువ ఆందోళనలేకుండా యిదంతా సాధించబడడం అభినందనీయం

కాని మన విద్యా విధానంలో ఏదోలోపం ఉంది. దానిని కాదనలేం మనం బహుసంఖ్యాకులైన పట్టభద్రులను తయారు చేస్తున్నాం వారు అన్ని రకాల ఉద్యోగాలకి ప్రయత్నించి విఫలులవుతున్నారు. ఉద్యోగం లభించనప్పుడు వారిలో చాల మంది కలతచెందుతున్నారు. అది సహజంగా ఆశాభంగానికీ, అసంతృప్తికి దారితీస్తుంది

ప్రస్తుతం ఒకవైపున నిరుద్యోగులసంఖ్య అధికంగా వుండగా మరొకవైపున తగిన మనుషులు లేక ఖాళీగావున్న ఉద్యోగాలు అనేకం ఉన్నాయి ఈ నిరుద్యోగులు వాటికి తగరు ప్రస్తుతం మనదేశంలో యీ పరస్పర విరుద్ధమైన పరిస్థితులు ఉన్నాయి. కాబట్టి మన విద్యావిధానాన్ని పూర్తిగా సంస్కరించి యేపనినైనా చేయగల మనుషులను తయారుచేయాలి విద్యలో శ్రద్ధాళువులైన వారందరినీ యీ సమస్య వేధిస్తున్నది. దాని పరిష్కారానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఉస్మానియా పట్టభద్రుల సంఘం యీ సమస్యపట్ల శ్రద్ధగైకొంటున్నందుకు నాకు సంతోషంగాఉంది.

## ఉద్యోగినుల వసతి గృహం

ఆగష్టు 22 న రాష్ట్రపతి హైద్రాబాదు బరకత్‌పూరాలో ఆంధ్ర యువతీ మండలిచే నిర్మింపబడిన ఉద్యోగినుల వసతి గృహాన్ని ప్రారంభించారు.

ఈ సందర్భములో ఆయన యిలా అన్నారు. స్త్రీలు అన్ని దిశలా అన్ని రంగాలలోను పైకి వస్తున్నారు. ఒకప్పుడు పురుషులకే నిర్దేశించబడిన పనులను ఇప్పుడు వారుచేస్తున్నారు. ఆఖరికి సాయుధబలాలలోకూడా వారు చేరుతున్నారు ఒకస్త్రీ పారచూటిస్టుగా అర్హత సంపాదించి వైమానిక దళాధిపతి గుర్తింపును పొందినట్టు మొన్న విన్నాను ఇది నిజంగా ప్రశంసనీయం.

ఐతే ఇది భారత దేశానికి క్రొత్తగా కొత్త విషయం గాదు. మన పూర్వ స్త్రీలు అవసరమైనప్పుడు యుద్ధాలు చేసేవారు యుద్ధం వారి వృత్తి కావాలనే నియమంలేదు. కాని దేశగౌరవం, వారి వ్యక్తిగౌరవాల ప్రశ్న వచ్చినప్పుడు వారు యుద్ధానికి వెనుదీయలేదు

అన్ని విధాలా, సిద్ధాంతరీత్యాను, ఆచరణలోను కూడా స్త్రీ పురుషులు సమానులుగా వుండే రోజులు వస్తాయని ఆశిస్తున్నాను.



1959 వ సం॥ ఆగష్టు 21 వ తేదీన రాష్ట్రపతి హైదరాబాదులో ఉస్మానియా పట్టభద్రుల సంఘం 27 వ వార్షిక సమావేశాన్ని ప్రారంభించారు



1959 వ సం॥ ఆగష్టు 17 వ తేదీన రాజభవన్‌లో రాష్ట్రపతి గౌరవార్థం అల్పాహార విందు చేయబడింది.



1959 వ సం॥ ఆగష్టు 24 వ తేదీన రాష్ట్రపతి గుంటూరు జిల్లా నిడుబ్రోలుకు సమీపంలోగల వినయాశ్రమంలో స్వామీ సీతారాంను కలుసుకున్నారు.



1959 వ సం॥ ఆగష్టు 22 వ తేదీన రాష్ట్రపతి హైదరాబాదు బర్కత్‌పూరాలో ఉద్యోగినుల వసతి గృహాన్ని ప్రారంభించారు

ఐతే ఆ సమానత అంటే ప్రకృతి తమకు నిర్దేశించిన పనిని వారు మానివేయాలని అర్థంకాదు స్త్రీలు తాము మామూలుగా చేసే పనులకుతోడు ఇంతవరకు పురుషులకు మాత్రమే పరిమితమైన పనులనుకూడా చేయాలి. అప్పుడే దేశంకోసము, తమ కోసము వారు ఉత్తమమైన సేవ చేయటము, ఆ విషయంలో వారిపై పెట్టుకొన్న ఆశలు ఫలించటము జరుగుతుంది యువతీ మండలి యిటువంటి సౌకర్యం కల్పించే బాధ్యతను స్వీకరించినందుకు నాకు సంతోషంగా వుంది

అంతకుముందు రాష్ట్రపతి జ్యోతి (కుతువిలక్కు)ని వెలిగించి వసతిగృహాన్ని సలాంఛనంగా ప్రారంభించారు

ఆగష్టు 23 రాత్రి రాష్ట్ర ప్రభుత్వము, ప్రజలు సికిందరాబాదు రైలుస్టేషనులో రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్‌కి వీడ్కోలు ఇచ్చారు రాష్ట్ర గవర్నరు, మంత్రులు, హైకోర్టు న్యాయమూర్తులు, శాసన సభ్యులు, పుర ప్రముఖులు ఆయన వెళ్లేవరకు స్టేషన్‌లో ఉన్నారు

ఆగష్టు 24 సోమవారం రాష్ట్రపతి గుంటూరు జిల్లాలో స్వామి సీతారాం వినయాశ్రమంలో గడిపి అక్కడినుంచి ఢిల్లీకి బయలుదేరారు.



# రాష్ట్ర వస్తూత్పత్తి సంఘం

రాష్ట్ర వస్తూత్పత్తి సంఘం తొలి సమావేశం సెక్రటేరియట్‌లో 9–8–59 న పరిశ్రమలు, దేవదర్మాదాయ శాఖా మంత్రి శ్రీ ఎ భగవంతరావు అధ్యక్షతన జరిగింది. అప్పుడు యీ సంఘం నిర్మాణ సూత్రాలు ఆమోదించబడినవి ఆమోదానికి ముందు వివిధ క్లాజులు పూర్తిగా చర్చించబడినవి.

సంఘం ముఖ్యాశయాలు, పనులు ఇవి —

1. ప్రభుత్వ, ప్రైవేటు విభాగాలు రెండింటిలోను, తేలిక, చిన్న రకం, మధ్య రకం భారీ పరిశ్రమలలో సహా పరిశ్రమల అన్ని రంగాలలోను వస్తూత్పత్తిని హెచ్చించటం ఆర్థిక కార్యకలాపాలు జరిగే అన్ని రంగాలలోను ఉత్పాదకోద్యమం ప్రారంభానికి తోవతీయటం

2 వస్తూత్పత్తి పద్ధతులు, విధానాలకి సంబంధించిన సమాచారాన్ని వివిధ సాధనాలతో ప్రచారం చేసి వస్తూత్పత్తి చైతన్యాన్ని వృద్ధిచేయటం ప్రచార సాధనాలలో పుస్తక ప్రచురణలు, ప్రదర్శనలు, యితర దృశ్య-శ్రవణ సాధనాలు వుంటాయి. సాంకేతిక డైజెస్టు సర్వీసు, సాంకేతిక దర్యాప్తు సర్వీసు యేర్పాటు చేయబడతాయి.



1959 వ సం॥ ఆగస్టు 9 వ తేదీన హైదరాబాదు సెక్రటేరియట్‌లో రాష్ట్ర వస్తూత్పత్తి సంఘ సమావేశం జరిగింది.

వస్తూత్పత్తి డాక్యుమెంటేషన్ సర్వీసు, లైబ్రరీ స్థాపించబడతాయి.

3. హెచ్చు వస్తూత్పత్తి ఆశయానికి సంబంధించిన కార్యక్రమం అమలును ప్రోత్సహించి ఆ విషయంలో తోడ్పటం. ఇందు నిమిత్తం వస్తూత్పత్తి జట్లు యేర్పాటు చేయబడి సాంకేతిక విషయాలు పరస్పరం తెలుసుకొనటానికి, అంతర్ కర్మాగార సందర్శనలకి అవకాశం కల్పించబడుతుంది. సలహాదారులు, నిపుణులు యేర్పాటు చేయబడతారు. వివిధ స్థాయిలలో అనగా మేనేజ్‌మెంటు, ఆపరేటివ్‌లు, టెక్నీషియన్లు, ట్రేడ్ యూనియను ప్రతినిధుల స్థాయిలలో వస్తూత్పత్తి శిక్షణ, వస్తూత్పత్తి పరిశోధన యేర్పాటు చేయబడతాయి.
4. యజమానులు, వుద్యోగుల మధ్య సుహృద్భావం నెలకొల్పటానికి కృషి.
5. వస్తూత్పత్తి హెచ్చుదలకై ఆంధ్ర ప్రదేశ్‌లో కొన్ని పరిశ్రమలు లేక స్థానిక ప్రాంతాలకు సంఘాలను యేర్పరచి తోడ్పడటం.
6. ప్రభుత్వం, కంపెనీలు, అసోసియేషన్లు, సంస్థలు, ఆర్గనైజేషన్లు - ఏర్పడినా ఏర్పడకపోయినా - వ్యక్తుల నుంచి వివిధ తరగతుల సభ్యులను చేర్చుకొని వారికి యీ సంఘం యొక్క వస్తూత్పత్తి ప్రాజెక్టులు, ప్రచురణలు, పరిశోధన మున్నగు కార్యకలాపాలు వుపకరించటానికి వీలు కల్పించటం.

తొలి సంఘం సభ్యులు 3 సంవత్సరాల పాటు పదవిలో వుంటారు.

ఈ సంఘంలో ప్రభుత్వం నామినేట్‌చేసే అధ్యక్ష ఉపాధ్యక్షులు, సభ్యుడు - కార్యదర్శి, కోశాధిపతులతో సహా 30 మంది సభ్యులకు మించి వుండకూడదు.

ఈ సంఘంలో రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులు, పరిశ్రమలలో యజమానులు, ఉద్యోగుల ప్రతినిధులు, ఇంజనీర్ల సంస్థ (ఇండియా) ఆంధ్ర ప్రదేశ్ సెంటర్ ప్రతినిధులు, వస్తూత్పత్తి హెచ్చుదలకు వుపకరించగలవని రాష్ట్ర ప్రభుత్వం భావించిన సంఘాలు, కౌన్సిల్‌లు లేక సంస్థల ప్రతినిధులు వుంటారు.

పంచదార, సిమెంటు పరిశ్రమలకు పరిశ్రమవారీ వస్తూత్పత్తి సంఘాల యేర్పాటుకు సంబంధించిన నిబంధనలను కూడా యీ తొలి సమావేశం ఆమోదించింది. ఈ నిబంధనల ప్రకారం రాష్ట్రంలోని పంచదార, సిమెంటు కర్మాగారాలన్నీ ఆయా సంఘాలకు నిర్ణీతమయిన చందా చెల్లించి రాష్ట్ర వస్తూత్పత్తి సంఘానికి దరఖాస్తు పెట్టి వాటిలో సభ్యులుగా చేరవచ్చు.

దిగువ సభ్యులతో రాష్ట్ర వస్తూత్పత్తి సంఘానికి ఒక స్థాయి సంఘం యేర్పాటు చేయబడింది.

1. అధ్యక్షుడు, పరిశ్రమల శాఖామంత్రి, 2. శ్రీ ఎమ్. సత్యనారాయణరెడ్డి, ఆంధ్ర ప్రదేశ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యదర్శి, 3. శ్రీ యం. హరిశ్చంద్ర ప్రసాద్, 4. శ్రీ కె. ఐ. విద్యాసాగర్ (ప్రైవేటు, ప్రభుత్వ విభాగాలలో ఒక్కొక్కరు చొప్పున యజమానుల ప్రతినిధులు), 5. లేబరు కమిషనరు, 6. పరిశ్రమలు, వాణిజ్య శాఖ కార్యదర్శి (ప్రభుత్వ ప్రతినిధులు), 7. శ్రీ ఆర్. యం. పాత్రి. ఇంజనీరు. డి. బి. ఆర్. మిల్సు (ఇంజనీరింగు ప్రతినిధి).



## గ్రంథ సమీక్ష:

### భూదేవి (తెలుగు)

రచన: శ్రీ టి. రామచంద్రరావు,

7ఎ/10 డబ్ల్యు. ఇ. ఎ. కరోల్బాగు (చన్నామార్కెటు), న్యూఢిల్లీ.

దేశంలో అధికాహారోత్పత్తి సాధనకై రైతులకు, వ్యవసాయంతో ప్రత్యక్ష సంబంధంగల తదితరులకు భూమిలో అంతర్గర్భితమయివున్న శక్తులను, ఆధునిక వ్యవసాయ పద్ధతులలో ఎక్కువ పండించటానికిగల అవకాశాలనుగురించి తెలియజేయటం జరుగుతున్నది. ఈ విషయమై యీ పుస్తకంలో శ్రీ రామచంద్రరావుగారు చక్కని ప్రయత్నం చేశారు. భాష సరళంగాను, ధారాళంగాను ఉంది. ఇది ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకుసైతం సులభ బోధకంకాగలదు. చిత్రాలతో ఆకర్షణీయంగావున్న యీ పుస్తకానికి కొత్తగా అక్షరాస్యులయినవారి పుస్తకాలలో కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ జరిపిన 5 వ పోటీలో బహుమతి వచ్చింది. వెల: రూ. 1·25 న.పై.

ప్రతులు గ్రంథకర్తవద్ద లభిస్తాయి.

# హైదరాబాదు

హైదరాబాదు జిల్లా రాష్ట్రం జిల్లాల్లో మిక్కిలి చిన్నది. బహుశా ఖమ్మం, శ్రీకాకుళం జిల్లాలతరువాత శైశవావస్థలోవున్న జిల్లాకూడా యిదే. ఒకప్పుడు దీనిపేరు అత్రాఫ్‌బల్దా. అంటే నగరం చుట్టూవున్న జిల్లాఅని అర్థం. అది నైజాం స్వంత ఎస్టేటు. అందులో అత్యధికభాగం సర్ఫేఖాస్ లేక "రాయల్ ప్రివర్సు" లు ఉండేవి. మిగిలిన రాష్ట్రానికి సర్ఫేఖాస్‌కి విస్పష్టమైన తేడా ఉండేది. దానికి స్వంత పోలీసు, ఖజానా, రెవిన్యూ, న్యాయ, విద్యా విధానాలు ఉండేవి. పోలీసుచర్య అనంతరం, 1949 మే లో సర్ఫేఖాస్‌ను దివానీయొక్క బాగాత్ జిల్లాలో విలీనంచేసి హైదరాబాదు జిల్లాను ఏర్పాటు చేయడం జరిగింది. ఆ తరువాత జాగీర్ ప్రాంతాలు కూడా దానిలో విలీనం చేయబడినవి. అప్పుడు దానిలో పశ్చిమ హైదరాబాదు, తూర్పు హైదరాబాదు, షాహబాదు, మేడ్చల్, ఇబ్రాహింపట్నం తాలూకాలు ఉండేవి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ పిమ్మట, మహబూబునగరం, మెదక్, గుల్బర్గా జిల్లాల నుంచి



రిక్షావాలా అదృష్టం.—1959 వ సం॥ ఆగస్టు 15 వ తేదీన నిజాం కళాశాల ఆట స్థలంలో రాష్ట్ర ముఖ్యమంత్రి హైదరాబాదు పాలీటెక్నిక్ రాఫిల్ బహుమతి టిక్కెట్లను తీస్తున్నారు. ఈ సందర్భంలో రూ 25,000 మొదటి బహుమానం ఒక రిక్షావానికి వచ్చింది.


HYDERABAD
DISTRICT
MEDCHAL
MEDCHAL
SECUNDERABAD
HYDERABAD
HYDERABAD
EAST
SHAMSHABAD R.S.
IBRAHIMPATAM
MAISARAM
IBRAHIMPATAM
OSMAN SAGAR
HYDERABAD
WEST
HIMAYAT SAGAR
CHEVELLA
SHAHABAD
VIKARABAD
KOET PALLI
VIKARABAD JUNCTION
DHARUR
PARGI
MAHAMMADABAD
TANDUR
TANDUR R.S.
BASHIRABAD R.S.
REFERENCE
DISTRICT BOUNDARY
TALUK BOUNDARY
NATIONAL HIGH WAYS
STATE HIGH WAYS
ROADS
RAILWAYS { M.G. B.G.
RIVER

హైదరాబాదు జిల్లా పటం.

వరుసగా పర్గి, వికారాబాదు, తాండూరు తాలూకాలు దానికి కలుపబడినవి. ఇటీవల పరిపాలనా సౌలభ్యందృష్ట్యా షాహబాదు తాలూకా ముఖ్యకార్య స్థానంచేవెళ్లకు తరలించబడి, మెదక్ జిల్లాలోని శంకరపల్లి ఫిర్కా దానికి కలుపబడింది. హైదరాబాదు జిల్లా ప్రస్తుతపు తాలూకాలు ఇవి.—1. పశ్చిమ హైదరాబాదు, 2. తూర్పు హైదరాబాదు, 3. పర్గి, 4. చేవెళ్ల, 5. తాండూరు, 6. వికారాబాదు, 7. మేడ్చల్, 8. ఇబ్రాహింపట్నం. ఈ జిల్లా మూడు రెవిన్యూ డివిజన్లుగా విభజింపబడింది. అవి.—1. తూర్పు హైదరాబాదు, 2. పశ్చిమ హైదరాబాదు, 3. వికారాబాదు.

**ఈ** జిల్లాకు ఉత్తరాన మెదక్ జిల్లా, దక్షిణాన మహబూబునగరం జిల్లా, తూర్పున నల్గొండ జిల్లా, పశ్చిమాన గుల్బర్గా జిల్లా ఉన్నాయి.

## విస్తీర్ణము జన సంఖ్య.

**ఈ జిల్లా** విస్తీర్ణం 2,986·91 చ॥ మైళ్లు, భూమి తరగతి వారీ విభజన వివరాలు ఇవి.—మొత్తం భౌగోళిక ప్రదేశం 18,67,129 ఎకరాలు, బీడు, సాగు లాయకుకాని భూములు. 1,79,138 ఎకరాలు. సాగు లాయకైన బంజరు 58,679 ఎకరాలు, ప్రస్తుతం (కరెంటు) సాగుబడిలేని భూములు 2,05,372 ఎకరాలు. సాగుబడిలేని ఇతర భూములు 56,299 ఎకరాలు, విత్తనాలు జల్లిన నికరం భూమి 8,58,133 ఎకరాలు. పంటక్రిందగల మొత్తం ప్రదేశం 8,77,592 ఎకరాలు.

**ఈ జిల్లాలో** 932 గ్రామాలు, 2 నగరాలు, 24 పట్టణాలు ఉన్నాయి. 1951 జనాభా లెక్కల ప్రకారం యీ జిల్లా జన సంఖ్య 18·18 లక్షలు. ఇందులో 6·33 లక్షలు పల్లె ప్రజలు, 11·85 లక్షలు పట్టణవాసులు. హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాల మొత్తం విస్తీర్ణం 83·3 చ. మై. 1951 జనాభా లెక్కల ప్రకారం జనసంఖ్య 10,85,722.

## నైసర్గిక స్వరూపం.

**ఈ జిల్లాలో** అధికభాగం కొండలు. అడవులు అక్కడక్కడ ఉన్నాయి. నగరంచుట్టూ 200—300 అడుగుల ఎత్తుగల కొండ గుట్టలు ఉన్నాయి. భూమి సాధారణ వాలు పడమరనుంచి తూర్పు లేక ఈశాన్యదిశగా ఉంటుంది.

## కొండలు, నదులు.

రాజకొండ కొండలశ్రేణి నల్గొండ జిల్లాలో పిప్పలపాడునుండి దేవరకొండ వరకు ఆగ్నేయ మూలగా వ్యాపించివుంది. అనంతగిరి శ్రేణి జిల్లా దక్షిణంనుంచి ఉత్తరానికి వ్యాపించింది. జిల్లా నడిబొడ్డునవున్న హైద్రాబాదు నగరం చుట్టూ మౌలాలీ, గోల్కొండ కొండలు, తిరుమల్‌ఘరీవద్ద బ్లాక్‌రాక్ ఉన్నాయి.

**ఈ** జిల్లాలో మిక్కిలి ముఖ్యమైన నది మూసీ నది. ఇది శివారెడ్డిపేట సమీపంలో అనంతగిరి కొండలలోపుట్టి దాదాపు తూర్పుగా ప్రవహిస్తూ హైద్రాబాదునగరంమీదుగా వెడుతుంది. ఈ నదిపై రాతి ఆనకట్ట నిర్మించబడి, ఏరు ఉస్మాన్‌సాగర్ సరస్సులోనికి తోడబడుతుంది. కాబట్టి యీ నది ఇంచుమించు ఎండిపోయి ఉంటుంది. మంజీరానది జిల్లా వాయవ్యదిశలోవున్న రెండు గ్రామాలను స్పృశిస్తుంది. ఇవికాక యీ జిల్లాలో మూసీ నది ఉపనది సాకల్‌వాని, మంజీర ఉపనదులు, హల్దీ, దేవోలు ప్రవహిస్తున్నాయి.

## ఖనిజాలు.

షాహాబాదులో స్వల్ప ప్రదేశం తప్ప దాదాపు మిగిలిన యావత్తు జిల్లాలోను పెనిన్సులర్ గ్రానైటు కాంప్లెక్సు వుంది. ఇసుకరాయి, చంద్రకాంత శిలలు ఆర్థిక ప్రాముఖ్యం గల ముఖ్య ఖనిజాలు. గాజు పరిశ్రమలో వాడే నాణ్యమైన యిసుకరాయి హైదరాబాదు నగరానికి సులభంగా దొరుకుతుందని కనుగొనబడింది. గ్రానైట్లు, నదియిసుక, సున్నం, కంకరలనుంచి భవన నిర్మాణానికి సరిపడు వస్తు సామగ్రి లభిస్తుంది.

## శీతోష్ణస్థితి

వెచ్చగా, పొడిగా వుంటుంది. నడి వేసవిలో సగటు ఉష్ణోగ్రత 92 డిగ్రీలు ఫా. మంచి చలి కాలంలో అది 62 డిగ్రీలు ఫా. చెరువులు చిన్నా పెద్దా అనేకం వుండటంవల్ల వాతావరణం స్వల్పంగా తేమగా వుంటుంది. అక్టోబరునుంచి మార్చివరకూ యీ జిల్లా సాధారణంగా చాలా ఆరోగ్యకరంగా వుంటుంది. దీని సగటు వర్షపాతం 30 4 ".

## భూములు

**ఈ** జిల్లాలో అక్కడిక్కడ కొన్నిచోట్ల నల్లరేగడ భూములు, మిగిలినచోటెల్లా యిసుక భూములు వున్నాయి. పట్లూరు, జూకాల్ ప్రాంతాలలో నల్లరేగడ భూములు వున్నాయి. ముఖ్యంగా నదీ లోయలు, కొండపాదాల భూములు సారవంతమైనవి.

ఉస్మాన్‌సాగర్, హుస్సేన్‌సాగర్, మీర్ ఆలం చెరువు, హిమాయత్ సాగర్‌లు నగరంలోను దాని చుట్టుపట్లగల ముఖ్యమైన చెరువులు చెరువులు, బావులు యీజిల్లాలో నీటి పారుదల ప్రధాన వనరులు.

## పంటలు

**ఈ** జిల్లాలో ముఖ్యమైన ఆహారపంట జొన్న. బియ్యం, బజ్రి, రాగి, మొక్కజొన్న, ఎల్లగిసె గింజలు, ప్రత్తి యితర ముఖ్య పంటలు.

## పరిశ్రమలు

పారిశ్రామికంగా యీ జిల్లా చాలా ముఖ్యమైనది. సిగరెట్ల తయారీ, వస్త్ర పరిశ్రమ, లోహపు పనులు, గాజు, మట్టిపనులు, నూనె, పెయింటు కర్మాగారాలు, ఔషధాల తయారీ, చర్మకార పరిశ్రమ, మిరాయిల తయారీలు జిల్లా ముఖ్య పరిశ్రమలు. నగరం ఆగ్నేయ భాగంలో పెద్ద పారిశ్రామిక కాలనీ నిర్మించబడింది. నగర సరిహద్దులలో గల సనత్ నగరంలో ఒక పారిశ్రామిక కేంద్రం ఏర్పాటు చేయబడింది.

నూలు నేత రంగులు, అద్దకం పనులు, ఉన్ని నేత, తాళ్ల అల్లకం, బీడీల తయారీ, పేము పనులు, బొమ్మల తయారీలు యీ జిల్లా ముఖ్యమైన కుటీర పరిశ్రమలలో కొన్ని.

## రవాణా, రాకపోకల సౌకర్యాలు

ఈ జిల్లాలో మొత్తం 620 మైళ్ల పొడుగు రోడ్లు వున్నాయి. అందులో 202 మై. కంకరరోడ్లు. నగరంనుంచి బయలుదేరే బస్సు మార్గాలు దాదాపు నగరం చుట్టూగల జిల్లా లన్నిటికి రవాణా సౌకర్యాలను సమకూరుస్తాయి. జాతీయ రహదారులలో ముఖ్యమైనవి కొన్ని నగరాన్ని స్పృశిస్తాయి. హైదరాబాదునుంచి విజయవాడ, వాడిలకు రెండు బ్రాడ్‌గేజ్ రైలు మార్గాలు, ద్రోణాచలం మన్‌మాడ్‌లకు రెండు మీటర్‌గేజ్ రైలు మార్గాలు వున్నాయి. ఇవికాక శివారు రైలు సర్వీసు, జంట నగరాలలో స్థానిక బస్సు సర్వీసు వున్నాయి.

ఈ జిల్లాలో 2 ప్రధాన తపాలా కార్యాలయాలు, 67 ఉప కార్యాలయాలు, 113 బ్రాంచి కార్యాలయాలు, 17 తంతి కార్యాలయాలు వున్నాయి.

30 ఆస్పత్రులు, 11 డిస్పెన్సరీలు. ప్రత్యేక చికిత్సకు 8 ఆస్పత్రులు వున్నాయి. 66 ఉన్నత పాఠశాలలు, 59 మాధ్యమిక పాఠశాలలు, 1,010 ప్రాథమిక పాఠశాలలు, 31 వయోజన విద్యా కేంద్రాలు, 3 ప్రత్యేక వృత్తి విద్యా పాఠశాలలు, 17 ఆర్ట్సు, సైన్సు కాలేజీలు, 6 వృత్తి విద్యా కళాశాలలు వున్నాయి.

## స్థానిక పరిపాలన

ఈ జిల్లాలో హైదరాబాదు, సికింద్రాబాదు మునిసిపలు కార్పొరేషన్లు రెండుకాక మరొక నగర మునిసిపాలిటీ-తాండూరు, 6 పట్టణ మునిసిపాలిటీలు-వికారాబాదు, ఇబ్రాహింపట్నం, అల్వాల్, షాహాబాదు, మేడ్చల్, షంషాబాదు వున్నాయి. 416 గ్రామ పంచాయతీలు వున్నాయి.

## నగరద్వయం

ఈ జిల్లాలో హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలు, గోల్కొండ కోట ఉన్నాయి. ఇదే యీ జిల్లాకి సంబంధించిన అతి ముఖ్య విషయం. లండన్, ఇస్తన్‌బుల్‌లవలె యీ నగర ద్వయంవల్లనే యీ జిల్లా ఏర్పడుతున్నది కాని దానంతట అది ఏర్పడటం లేదు. 1589 లో నిర్మించబడిన హైద్రాబాదు నగరం యిటీవల సంవత్సరాలలో బాగా అభివృద్ధిచెందింది. ఇది దేశంలో మిక్కిలి పెద్ద నగరాలలో ఆరవది. ఇక్కడ చారిత్రక, పురావస్తువిషయకమైన విశేషాలెన్నో వున్నవి. కాబట్టి ఇది దేశంలో మిక్కిలి పెద్ద రాష్ట్రాలలో నాలుగవ రాష్ట్రానికి రాజధాని కావడానికి మిక్కిలి తగివున్నది. చార్మినారు, ప్రసిద్ధమైన మక్కా మసీదు, వైభవోపేతమైన ఫలక్‌నామా రాజసౌధం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, పౌరోద్యానాలు, అక్కడి మ్యూజియం, ఉస్మానియా జనరల్ ఆస్పత్రి, హైకోర్టు, సుప్రసిద్ధమైన సాలార్‌జంగ్ మ్యూజియం చూడతగినవి.

సికింద్రాబాదును హైద్రాబాద్‌నుంచి హుస్సేన్‌సాగర్ సరస్సు విడదీస్తుంది. బ్రిటిషువారి కాలంలో ఒకప్పుడు సికింద్రాబాదు మిక్కిలి పెద్ద మిలిటరీ కేంద్రాలలో ఒకటిగా వుండేది. ఇక్కడ రేస్ కోర్సు, పెరేడ్ మైదానాలు, చక్కని శివారు నివాసప్రాంతాలు ఉన్నాయి. ఈ నగరంలో అసాధారణమైన సంస్కారం కనపడుతుంది.

అల్వాల్‌లోగల బాలాజీ దేవాలయాన్ని స్వర్గీయ మహారాజా చందూలాల్ బహదూరు తాము హైద్రాబాదు ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు నిర్మించారు. మెడోస్ టెయిలర్ రచించిన "కన్ఫెషన్స్ ఆఫ్ ఎ థగ్" పుస్తకం ప్రకారం అల్వాల్‌కి చారిత్ర ప్రాముఖ్యంకూడా ఉంది. పిండారీతెగ నాయకుడు చీటు అమరావతి నుంచి హైద్రాబాదుకు ప్రయాణంచేస్తూ మధ్యలో స్వల్ప కాలం అల్వాల్‌లో విడిది చేశాడని యీ పుస్తకంలో పేర్కొనబడింది.

పశ్చిమ హైద్రాబాదు తాలూకా రాజేంద్రనగర్ బ్లాకులోని నర్సింగ్ పశువుల వ్యాపార కేంద్రంగా ప్రసిద్ధికెక్కింది. ఇక్కడ ప్రతి శుక్రవారం సంత జరుగుతుంది.

తాండూరు షాహాబాదు రాయికి ప్రసిద్ధి.

వికారాబాదు తాలూకా అనంతగిరిలో ఏటా అనంతస్వామిజాతర జరుగుతుంది.

## సమాజాభివృద్ధి.

ఈ జిల్లాలో 7 తాలూకాలలో 8 అభివృద్ధి కేంద్రాలు ఉన్నాయి. ఈ కేంద్రాల వివరాలు ఇవి.—

1. ఇబ్రాహింపట్నం మొదటి అంచె కేంద్రం.
2. వికారాబాదు రెండవ అంచె కేంద్రం.
3. హాయతీనగరం మొదటి అంచె కేంద్రం.
4. మేడ్చల్ సమితి బ్లాకు.
5. రాజేంద్రనగరం సమాజాభివృద్ధి కేంద్రం.
6. చేవెళ్ల మొదటి అంచె కేంద్రం.
7. మోమిన్‌పేట మొదటి అంచె కేంద్రం.
8. తాండూరు మొదటి అంచె కేంద్రం.

ఇండియాలో అభివృద్ధి కేంద్ర సిబ్బందికి శిక్షణ యిచ్చే ముఖ్య కేంద్రాలలో రాజేంద్రనగరం ఒకటి.

వర్గి తాలూకా లఖ్నపూర్ మధ్యరకం నీటి పారుదల ప్రాజెక్టు, దాని పరిశోధనలు దాదాపు పూర్తి ఐనవి.

తాండూరు తాలూకాలో జటప్పల్లి మధ్యరకం నీటి పారుదల ప్రాజెక్టు పని ప్రారంభమైంది.

## ప్రజా ప్రతినిధులు.

లోక సభ సభ్యులు.—

1. శ్రీ ఎస్. చెన్నారెడ్డి
2. శ్రీ అక్బర్ అలీ ఖాన్
3. శ్రీ ఎన్. నరోత్తమరెడ్డి
4. డా. రాజ్‌బహదూర్ గోర్
5. శ్రీ వినాయకరావు
6. శ్రీ అహమ్మద్ మొహిద్దీన్
7. శ్రీమతి సంగం లక్ష్మీబాయ్

శాసన సభ సభ్యులు.—

1. శ్రీ కె. వి. రంగారెడ్డి
2. డా. ఎం. చెన్నారెడ్డి
3. శ్రీ గోపాలరావు ఎక్బోటే
4. శ్రీ బి. వి. గురుమూర్తి
5. శ్రీ జగన్మోహనరెడ్డి
6. డా. ఎం. ఎస్. లక్ష్మీనరసయ్య
7. శ్రీమతి మాసూమా బేగం
8. శ్రీ కె. వి నరసింగరావు (పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి)
9. శ్రీ నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ (సహకారం, గృహవసతి శాఖా మంత్రి)
10. శ్రీ వి. రామారావు
11. శ్రీ మీర్ అహమ్మద్ అలీ ఖాన్
12. శ్రీ అరిగె రామస్వామి
13. శ్రీ కె. సత్యనారాయణ
14. శ్రీ కొత్తూరు సీతయ్య గుప్త
15. శ్రీ షాహీ బద్దీన్ అహమ్మద్ ఖాన్
16. శ్రీమతి సుమిత్రా దేవి
17. శ్రీ వాసుదేవ కృష్ణాజీ నాయక్
18. శ్రీ వి. రామచంద్రరావు

శాసన మండలి సభ్యులు.—

1. శ్రీ ఎం. భోజిరెడ్డి
2. శ్రీ ఇ. సత్యనారాయణ
3. శ్రీ అతా రహమాన్
4. శ్రీ అబూ యూసఫ్
5. శ్రీ జైన్ యార్ జంగ్ బహదూర్
6. శ్రీ ఎర్నెస్ట్ గిడ్వాన్
7. శ్రీ హామూన్ ఖాన్ షెర్వానీ
8. శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవి



అభివృద్ధి కేంద్రాల ప్రగతి :

# గార

గార పంచాయతీ సమితి అభివృద్ధి కేంద్రం క్రింద 102-66 చ. మై.—85,697·00 యె—విస్తీర్ణం వుంది. అందులో శ్రీకాకుళం రెవిన్యూ తాలూకాలోనివి 52 ప్రధాన గ్రామాలు, 138 శివారు గ్రామాలు వున్నాయి.

ఈ అభివృద్ధి కేంద్రం పటంలో ద్వీపకల్పంలా కనబడుతుంది. దానికి ఉత్తరాన వంశధారానది, తూర్పున బంగాళాఖాతము, దక్షిణాన నాగావళీ నది, పశ్చిమాన ఆమదాల వలస రెండవ అంచె అభివృద్ధి కేంద్రము వున్నాయి.

ఈ అభివృద్ధి కేంద్రం విశేషమేమంటే యీ జిల్లాలోని పెద్ద నదులు రెండూ యిక్కడే సముద్రంలో కలుస్తాయి. వంశధారా నది కళింగపట్నం వద్ద సముద్రములో కలుస్తుంది. కళింగపట్నం ప్రాచీన గ్రామం. ఒకప్పుడు అది విస్తారమయిన సముద్ర వ్యాపార కేంద్రం. విశాఖపట్నం భారీ నౌకాశ్రయ నిర్మాణానికి యెంతో ముందు అక్కడికి నౌకలు వచ్చేవి. నాగావళీ నది జిలా కలెక్టరు కార్యాలయ భవనాలకు యించుమించు మూడు మైళ్ల దూరంలో వున్న మొహూస్ బందర్ గ్రామం వద్ద సముద్రంలో కలుస్తుంది.

ఈ అభివృద్ధి కేంద్రానికి గొప్ప చారిత్రక ప్రాముఖ్యమున్నది. ఎందువల్లనంటే అభివృద్ధి కేంద్ర ముఖ్య కార్యస్థాన భవనాలకు మిక్కిలి సమీపంలో గల శాలిహుండం కొండలపై బౌద్ధమత సంస్కృతులకు సంబంధించిన ప్రాచీన విశేషాలున్నాయి. ఆ కొండ యాత్రా కేంద్రం.

అరసవల్లి శ్రీ సూర్యనారాయణస్వామి దేవాలయము, శ్రీ కూర్మం కూర్మనాథస్వామి ఆలయాలు, శ్రీకాకుళంలో జుమ్మా మసీదు కూడా యీ కేంద్రంలోనే వున్నాయి. ఈ జుమ్మా మసీదు దక్షిణ భారతంలో మిక్కిలి పెద్ద మసీదులలో ఒకటిగా పరిగణించబడుతున్నది. ప్రాముఖ్యంలో బహుశా హైదరాబాదు జుమ్మా మసీదు తరువాత స్థానం దీనిదే.

ఈ కేంద్రం అనేకమయిన అభివృద్ధి పథకాల అమలుకి యెన్నుకోబడిన విశిష్టత గణించింది. 1946 లో స్వర్గీయ శ్రీ ప్రకాశం సమష్టి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్నప్పుడు యీ కేంద్రంలో ఫిర్కా అభివృద్ధి పథకం ప్రవేశ పెట్టబడింది. ఇది కాక అనేక అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభించబడినవి. ఆ తరువాత 1950 లో యిది గ్రామాభివృద్ధి ప్రాంతంగా మార్చబడింది. 1954 వ సం॥ ఏప్రిల్ 4 వ తేదీన సి. డి. కార్యక్రమాన్ని ప్రవేశపెట్టటానికై కేంద్ర ప్రభుత్వం యీ కేంద్రాన్ని యెన్నుకుంది. మొత్తం కేటాయింపు రూ 12,60,600 లోను రూ 3,26,700-ప్రజల విరాళం రూ 85,000 కాక-ఖర్చుచేయబడినవి. 1956 వ సం॥ మే 1 వ తేదీన యిది సమాజాభివృద్ధి కేంద్రం అయింది. మళ్లీ మూడు శ్రేణులలో ప్రజాస్వామ్య వికేంద్రీకరణపై బల్వంతరాయ్ మెహతా కమిటీచేసిన సిఫార్సుల ననుసరించి అభివృద్ధి కేంద్ర స్థాయిలో యీ పథకాన్ని అమలు పరచి చూడటానికి యెన్నుకున్న 20 కేంద్రాలలో ఒకటిగా రాష్ట్ర ప్రభుత్వం దీనిని యెన్నుకుంది. 1958 వ సం॥ జూలై 1 వ తేదీన పాత శ్రీకాకుళంలో అడ్వకేటు శ్రీ టి. సత్యనారాయణ అధ్యక్షుడుగా ఆడ్ హాక్ పంచాయతీ సమితి యేర్పాటుచేయబడింది. ఇది యీ పథకం క్రింద అభివృద్ధి కేంద్ర నిర్వహణను చేపట్టింది. ఈ సమితి పని ప్రారంభించిది సంవత్సరం దాటింది. ఈ కాలంలో అది విజయవంతంగా కృషి చేసింది.

1959 వ సం॥లో ఏప్రిల్ 1 వ తేదీనుంచి యీ కేంద్రం రెండవ అంచె స్థాయిని అందుకుంది.

ఈ అభివృద్ధి కేంద్రంలో అమలుపరచిన ముఖ్యమయిన పథకాల వివరాలు దిగువ యివ్వబడినవి.

## వ్యవసాయం.

1956 లో రాగోలు గ్రామంలో ఒక వ్యవసాయ ప్రదర్శన పరిశోధనా కేంద్రం నెలకొల్పబడింది. దీని క్రింద మెట్ట, మాగాణి భూములు మొత్తం 30 యెకరాలు వున్నాయి.

అభివృద్ధి కేంద్ర ముఖ్య కార్యస్థానంలో పక్కా కళ్లం గల విత్తనాల స్టోర్ నిర్మించబడింది.

1957—58 లో పాత శ్రీకాకుళం శివారు కుదుకు పేటలో ప్రభుత్వ విత్తనాల క్షేత్రం కూడా ఒకటి ప్రారంభించబడింది. ఇది కాక రైతుల కమతాలలో పెక్కు విత్తనాల క్షేత్రాలు ప్రారంభించబడినవి.

10. గ్రా. స్థా. కా. మండలాలలో ఒక్కొక్కటి చొప్పున పది ఆదర్శ క్షేత్రాలు యేర్పాటు చేయబడినవి.

### పశుపోషణ.

శ్రీకాకుళంలో కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాన్ని నడపటానికై ఒక భవనం నిర్మించబడింది. దానిలో ఆ కేంద్రం పనిచేస్తున్నది. ఈ కేంద్రంలో రెండు ఒంగోలు వృషభాలు వున్నాయి. ఇవికాక యీ కేంద్రంలో యితరచోట్ల 3 ఒంగోలు వృషభాలు, 3 ముర్రా బర్రెలు వున్నాయి.

అ. కేంద్ర ముఖ్య కార్య స్థానంలో ఛిన్న పశువైద్య డిస్పెన్సరీ ప్రారంభించబడింది. ఇందు నిమిత్తం ఒక భవనం నిర్మించ బడింది. ఆ పైన మరి మూడు చోట్ల పంచాయతీలచే ప్రథమ చికిత్సా కేంద్రాలు నడుపబడుతున్నాయి.

8. కేంద్రాలలో కోళ్ళ పెంపకానికి యేర్పాట్లు చేయబడినవి. చాలమందికి విదేశీ రకాలు—వైట్‌లెగ్ హారన్సు, రోడే ఐలండ్ రెడ్-సరఫరా చేయబడినవి.

స్థానిక గొర్రె జాతి అభివృద్ధికై 30 నెల్లూరు పొట్టేళ్లు కూడా ప్రవేశ పెట్టబడ్డాయి.

### నీటిపారుదల.

ఈ పద్దు క్రింద కేటాయించబడిన రూ. 4·00 లక్షలలోను రూ. 3·50 లక్షలు పంపు సెట్ల యేర్పాటు, కొత్త నీటి పారుదల బావుల త్రవ్వకం, యితర బావులు, చెరువుల మరమ్మతు, నీటి పారుదల ప్రయోజనాలకు పశువుల కొనుగోలు, 32 నీటి పారుదల వనరుల (పెద్దా చిన్నా) మరమ్మతులకై అప్పులపై ఖర్చు చేయ బడినవి. వంశధారా నది గర్భంలో బైరి కాలవ ముఖద్వారం వద్ద ముతక రాతి ఆనకట్ట నిర్మాణం, నాగావళినదినుంచి బయలుదేరే వాడాడ ప్రధాన కాలవ వంక తీర్చటం పనులు రెండూ యించు మించు రూ 30,000 అంచనా ఖర్చుపై చేపట్టబడి అ. కేంద్ర కార్యక్రమం క్రింద అమలు పరచబడుతున్నవి. ఈ కేంద్రం లోని మాగాణి భూములలో 80 శాతం యీ రెండు నదీకాలవల రిజిష్టరుడు ఆయకట్టు క్రింద వున్నందున యీ రెండు కాలువలు యీ అ. కేంద్ర ప్రజల ఆయువు పట్టు అని చెప్పవచ్చు.

1958–59 లో కొత్త బావుల సబ్సిడీ పథకం క్రింద పంట బావుల నిర్మాణకై 11 మంది రైతులకు రూ. 8,250 అప్పులు యివ్వబడ్డాయి. నీటి పారుదల క్రిందకు అదనపు ప్రాంతాన్ని తీసికొనివచ్చి ఆహారోత్పత్తి హెచ్చుదలకు దోహదం చేయటం దీని ఆశయం.

### ఆరోగ్యము, పారిశుద్ధ్యము.

అ. కేంద్ర కార్యక్రమం క్రింద శ్రీ కూర్మంలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ప్రారంభింపబడింది. ఆపైన గార, కళింగ పట్నం, సింగుపురాలలో 3 స్థా. ని. డిస్పెన్సరీలు, గార, శ్రీ కూర్మం పాత్రునివలస, బవ్పిలిలలో 4 ప్రసూతి, శిశురక్షణ కేంద్రాలు వున్నాయి.

మంచినీటి సౌకర్యాలకై 20 కొత్త బావులు నిర్మించబడ్డాయి. 62 పాత బావులు బాగు చేయబడ్డాయి. ఒక చెరువు నిర్మించ బడింది (కళింగపట్నం శివారు మాచిరేశంలో). ఒమరవిల్లి, తాన్‌సాహెబు పేట (కళింగపట్నం శివారు) లలో మంచినీటిబావుల వద్ద పక్కా మురుగు కాలవలు నిర్మించబడ్డాయి.

కోర్ని గ్రామంలో ఒక కుష్టు క్లినిక్ తెరువబడింది. ఇటీవల దీనికి ఒక భవనం కూడా నిర్మించబడింది.

### విద్య.

ఈ అ. కేంద్రంలో 4 ఉన్నత పాఠశాలలు, 121 ప్రాథమిక పాఠశాలలు, ఒక వృత్తి విద్యా పాఠశాలవున్నాయి. పదిచోట్ల పాఠశాలా భవనాలు—వాటిలో రెండు మాధ్యమిక పాఠశాలా భవ నాలు—నిర్మించబడ్డాయి.

అ. కేంద్ర ముఖ్య కార్యస్థానంలో ఒక సమాచార కేంద్రము, ఫిర్కా కేంద్ర గ్రంథాలయము వున్నాయి.

13 చోట్ల వయోజన విద్యా కేంద్రాలు ప్రారంభింపబడినవి. తాన్‌సాహెబ్‌పేట కేంద్రం స్త్రీలది. ఈ జిల్లాలో యీ రకం కేంద్రాలలో యిదే మొదటిది. ఇది 28-6-59 న తెరువ బడింది.

ఆటవస్తువులతో మూడు పిల్లల పార్కులు వున్నాయి.

12 పంచాయతీలకు 12 కమ్యూనిటీ రేడియో సెట్లు సరఫరా చేయబడినవి.

అ. కేంద్ర ముఖ్య కార్యస్థానంలోను, ఒప్పంగి గ్రామంలోనూ పఠన మందిరాలు నిర్మించబడ్డాయి.

66 యువజన క్లబ్బులు, 10 పిల్లల గ్రంథాలయాలు ప్రారం భింపబడినవి.

13 గ్రామ సహాయకుల శిక్షణా శిబిరాలు నడుపబడినవి 655 మంది (స్త్రీలు, పురుషులు) కి శిక్షణ యివ్వబడింది.

అ. కేంద్రంలో చేపట్టబడిన అభివృద్ధి కార్యకలాపాలను ప్రజ లకు బోధపరచుటకై సైన్ పరికరాలు వున్నాయి. శిక్షణ పొందిన ఆపరేటర్ వున్నాడు.

### రాకపోకల సౌకర్యాలు

47 రోడ్ల నిమిత్తం రూ 1,00,800 లు ఖర్చు పెట్టబడినవి. 14 మైళ్ళ పొడుగున పక్కా రోడ్లు నిర్మించబడ్డాయి.

### గ్రామీణ కళలు, వృత్తులు

దిగువ ప్రదర్శన—శిక్షణా కేంద్రాలు ప్రారంభింపబడినవి.

### కుంభకార పరిశ్రమ

అ. కేంద్ర ముఖ్య స్థానంలో 1-4-1959 నుంచి వుమ్మడి సౌకర్య కేంద్రంగా మార్చబడింది.

నవారు నేత.—కళింగపట్నం శివారు తాన్‌సాహెబు పేట.

కుట్టుపని.—శ్రీకూర్మం.

**పీచుతాటి అల్లికం.**—కళింగపట్నం శివారు మాచిలేశం. **వార్ధా ఘనీయూనిట్టు**—కేంద్ర నూనె గింజల కమిటీ మంజూరుచేసి నది.—ఒమరవిల్లి.

ఆధునికపద్ధతులలో యిటుకల తయారీని నేర్చుకొనటానికి యిద్దరు చేతిపనివారు రాజమండ్రి పంపబడ్డారు. కళింగ పట్నం ఒమరవిల్లిలలో పుప్పు పెద్ద యెత్తున తయారు అవుతుంది. కుంభ కార పరిశ్రమ ప్రదర్శన—శిక్షణా కేంద్రంలో శిక్షణపొందిన 24 మందిలోను 22 మంది కుంభకార పారిశ్రామిక సహకార సంఘంగా యేర్పడ్డారు. ఈ సంఘం వాటామూలధనం రూ 815 లు. పెద్ద ఆవ నిర్మాణానికై రూ 5,000 లు పారిశ్రామిక ఋణానికి దర ఖాస్తు పెట్టారు. తాము నేర్చుకున్న వృత్తి నవలంబించాలని వీరి ఆశయం.

తాన్‌సాహెబు పేటలో నవారు నేత నేర్చుకున్న 60 మంది స్త్రీలలోను ఏడుగురు కళింగ పట్నం బహూకార్థ సాధక సహకార సంఘంలో చేరారు. ఆ వృత్తి నవలంబించటానికి వీలుగా వారికి ఒక్కొక్కరికి రూ 700 లు అప్పు ఇవ్వబడింది. మిగిలిన వారు నేత కులవృత్తిగా గలవారు. వీరు తమ వృత్తిలోవున్నారు. కొందరు నవారు కూడా నేస్తున్నారు.

**సహకార సంఘాలు.**—ఈ అ. కేంద్రంలో 72 సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. ఇందులో 3 పారిశ్రామిక సహకార సంఘాలు. ఇవి జనాభాలో 60 శాతానికి ఉపకరిస్తున్నాయి. శ్రీకూర్మంలో ఒక పెద్ద రకం సహకార సంఘం వుంది. అది రూ 30,000 లు ఖర్చుపై స్వంత గిడ్డంగి నిర్మాణానికి పూను కున్నది. వచ్చవలస గ్రామంలో ప్రయోగాత్మకంగా ఒక సహ కార సమష్టి వ్యవసాయ సంఘం యేర్పాటుచేయబడుతున్నది.

**చిన్న మొత్తాల పొదుపు పథకం.**—ఇంతవరకూ రూ 36,000 లు పెట్టుబడి పెట్టబడినవి.

**గ్రామీణ గృహవసతి.**—బ్లాకు అభివృద్ధి అధికారి, ఆరు గురు విస్తరణాధికార్లు, మొత్తం పదిమంది గ్రా. స్థా. కార్యకర్తలకి యిళ్లు కట్టబడ్డాయి. శ్రీకూర్మం ప్రా. ఆరోగ్య కేంద్ర వైద్యాధి కారికి వుద్దేశించిన యిల్లు నిర్మాణంలో వుంది.

**పంచాయతీలు.**—ఈ అ. కేంద్రంలోని మొత్తం 52 గ్రామాలు పంచాయతీల క్రింద వున్నాయి (39). ఈ 39 పంచా యతీల అధ్యక్షులు అడ్‌హాక్ పంచాయతీ సమితి ఎక్స్–అఫీషియో సభ్యులుగా వున్నారు.

## ప్రత్యేక పథకాలు

**కుటుంబానికొక ప్రణాళిక పథకం.**—ఈపథకం 1-6-1958 నుంచి తాన్‌సాహెబ్ పేటలో అమలు పరచబడుతున్నది. ఇక్కడ గల 125 కుటుంబాలలోను 46 రైతు కుటుంబాలు. ఇప్పుడు యీ పథకం రెండో సంవత్సరంలో అడుగిడింది. జరిగే సంవత్సరం బ్లాకు బడ్జెట్టు, ప్రణాళికా పథకాలు, మామూలు బడ్జెటు, పంచాయతీ, ప్రజల విరాళాల నుంచి యీ గ్రామానికి వుద్దేశించిన వివిధ అభివృద్ధి పథకాలకై రూ 35,000 లు ఖర్చు పెట్టాలని సంకల్పం.

**జాతీయ గ్రామీణ నీటి సరఫరా పథకం.**—ఈ పథకం అమలుకై పంచాయతీ సమితి 8 గ్రామాలను అనగా గార, ఒమ రవిల్లి, కళింగట్నం, కొర్ని–కొర్లం, నిజామాబాదు, అంపోలు, శ్రీకూర్మం, కిల్లిపాలెం గ్రామాలను యెన్నింది.

ఈ పథకానికి అధ్వర్యం వహించే సహాయ ఇంజనీరు యీ గ్రామాలను దర్శించి, ప్రాథమిక పరిశీలన పూర్తిచేశారు. ఈ పథకం జరిగే సంవత్సరం రూ 40,000 లు ఖర్చుపై అమలు పరచబడుతుందని భావించబడుతున్నది.

స్త్రీ సంక్షేమం.—గార, అంపోలులలో రెండు స్త్రీ సంక్షేమ కేంద్రాలు వున్నాయి. మొదటి దానిని స్త్రీ సంక్షేమశాఖ, రెండవ దానిని కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం క్రింద జిల్లా ప్రాజెక్టు అమలు కమిటీ నడుపుతున్నాయి. రెండవ కేంద్రం కేం. సాం. స. సంఘం రూ 7,000 లతో నిర్మించిన భవనంలో వుంది.

భూకమతాల యేకీకరణ.—ఈ పథకాన్ని ప్రయోగాత్మకంగా అమలు పరచటానికై యీ. అ. కేంద్రం యెన్నబడింది.

గ్రామ రస్తాలు.—ఈ పథకంక్రింద రూ 33,000 అంచనాపై మొత్తం 3 మై. 2 ఫర్లాంగుల నిడివి గల రెండు రోడ్డు పనులు చేపట్టబడినవి.

## స్థానికాభివృద్ధి పనులు

| | | |
|---|---|---|
| 1. నిమ్మపేట ఆదర్శ గ్రామంలో వాటర్ సీల్ ల్లాజెట్టు, మరుగు దొడ్లు. | రూ. | 21,500 |
| 2. కళింగపట్నంలో వున్నత పాఠశాలా భవనాల అభివృద్ధి. | రూ. | 11,000 |
| 3. శ్రీకూర్మంలో పాఠశాలా భవనాల నిర్మాణం. | రూ. | 18,500 |
| 4. సింగుపురంలో పాఠశాలా భవనాల నిర్మాణం. | రూ. | 20,000 |
| 5. నిమ్మపేట ఆ. గ్రామం నుంచి అంబటివానిపేటకు రోడ్డు. | రూ. | 3,800 |
| 6. పాత్రుని వలసవద్ద వాడాడ కాలువకు వంతెన. | రూ. | 10,000 |
| మొత్తం | ... | 84,800 |

సాంఘిక సంక్షేమం.—1957-58 లో సహాయక గ్రాంటుల పథకం క్రింద ఒమరవిల్లిలో 26 యిళ్లుగల హరిజన కాలనీ ప్రారం భించబడింది. ఈ పథకం యీ యేడు పూర్తి కాగలదని భావించ బడుతున్నది. కాలనీ వారికి ఒక్కొక్కరికి రూ 500 (రూ 250 సబ్సిడీ రూ 250 అప్పు) యివ్వబడినవి.

1958-59 లో శ్రీ కూర్మంలో 20 మంది హరిజన విద్యార్థులకు వసతి గృహం ప్రారంభించబడింది. దీనిని యింకా సాంఘిక సంక్షేమశాఖ దృఢమయిన పునాదులపై నెలకొల్ప వలసివుంది.

అంపోలు, ఇప్పిలి, అడవరం గ్రామాలలో హరిజనులకు మంచి నీటి బావులు త్రివ్వబడినవి. సింగుపురం, శాలిహుండాలలో వున్న బావులకు చప్టాలు కట్టించబడినవి. ఈ పనులను పంచాయతీ సమితి చూస్తున్నది.

జరిగే సంవత్సరంలో హరిజనులకు నాలుగు కొత్త బావులను తవ్వాలని సంకల్పించ బడింది.

ఆదర్శ గ్రామాలు.—రామచంద్రపురం శివారు సిమ్మపేట, అంపోలి శివారు రామకృష్ణాపురాలు రెండూ యీ కేంద్రలో ఆదర్శ గ్రామాలు. సిమ్మపేటలో సహకార గృహ నిర్మాణ సంఘం యేర్పరచబడింది. దానికి రూ 34,500 యివ్వబడినవి. ఈ ఆదర్శ గ్రామంలో, ఆటవస్తువులతో ఒక పిల్లల పార్కు, చప్టాగల మంచి నీటి బావి, పాఠశాలా భవనం, అన్ని యిళ్లకి వాటర్‌సీల్ క్లాసెట్ మరుగు దొడ్లు, స్నానాల గదులు, ఒక వ. వి. కేంద్రం, ఒక యువజన క్లబ్బు, ఒక మహిళామండలి, రెండు సహకార సంఘాలు ఆధునిక కోళ్ల పెంపక కేంద్రాలు యేర్పాటు చేయబడ్డాయి. ఇందుకు మొత్తం రూ 72,200 ఖర్చు అయినవి. ఇందులో యించుమించు రూ 11,750 లు ప్రజలు యిచ్చారు.

రామకృష్ణాపురంలో ఒక పాఠశాల, ఆట వస్తువులతో పిల్లల పార్కు, ఒక మత్స్య పరిశ్రమ దొరువు, ఒక సహకార సంఘం యేర్పాటు చేయబడినవి.

వ్యయం—4-4-54, 1959 వ సం॥ మార్చి 31 వ తేదిమధ్య కాలపు ప్రణాళికా కేటాయింపు రూ 12 లక్షలలోను,రూ 10·56 లక్షలు ఖర్చు పెట్టబడినవి. మిగిలిన రూ 1·44 లక్షలలోను రూ 0·88 అ. కేంద్ర ముఖ్య స్థానం పద్దు క్రింద ఆదా. మిగిలిన రూ 0·16 లక్షలు డాలర్ ప్రొవిజన్ క్రింద యీ కేంద్రానికి సరఫరా చేయబడిన సైన్ పరికరాల ఖరీదు. తక్కిన 0·40 లక్షలు సి. డి. కాలం మిగులుగా రెండవ అంచెకాలంలో ఖర్చు పెట్టటానికి అనుమతి కోరబడింది.

జరిగే సంవత్సరం అ. కేంద్ర నిధులనుంచి పెట్టుబడి లభించే పథకాలు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికా పథకాలు, మామూలు డిపార్టుమెంటల్ ఫండ్సు, ప్రజల విరాళాలు, కేంద్ర, తదితర గ్రాంట్ల క్రింద రూ 19,64,000 ఖర్చు పెట్టాలని సంకల్పం. వివరాలు యివి.

| | | |
|---|---|---|
| 1 వ భాగం—అ. కేంద్ర నిధులు | ... | రూ 1,13,300 |
| 2 వ భాగం—ద్వి. పం. ప్ర. పథకం | ... | రూ 5,52,663 |
| 3 వ భాగం—మామూలు డిపార్టుమెంటల్ బడ్జెటు. | ... | రూ 10,05,599 |
| 4 వ భాగం—ప్రజల విరాళాలు, కేంద్ర గ్రాంట్లు యితర పథకాలు. | ... | రూ 2,92,398 |
| మొత్తం... | 19,63,960 | లేక 19,64,000 |

మరొక విశేష మేమంటే ప్రత్యేకాధికారి 1959-60 కి ఆదర్శ ప్రణాళికను తయారు చేయటానికి ప్రభుత్వం యీ పంచాయతీ సమితి కేంద్రాన్ని యెన్నింది. ఈ ప్రణాళిక అచ్చు ప్రతులు అన్ని శాఖాధిపతులు, జిల్లా ఆఫీసర్లు, కలక్టర్లు మిగిలిన అన్ని అ. కేంద్రాలకు పంపబడినవి. రాష్ట్రంలోని అ. కేంద్రాలన్నీ యిటువంటి ప్రణాళికలను తయారు చేయటంలో యిది నమూనాగా వాడబడుతుంది.



బాపట్లలో

# గ్రామ సేవకుల శిక్షణ

సమాజాభివృద్ధి కార్య క్రమం క్రింద గ్రామ స్థాయిలో సాంకేతి కార్థతలుగల బహుళార్థసాధక కార్య కర్తల అవసరం నానాటికీ హెచ్చుతున్నది. కాబట్టి, యీ అవసరం తీర్చటానికై ఆంధ్ర ప్రాంతంలో బాపట్ల, నంద్యాలలో చెరొకటి చొప్పున రెండు బేసిక్ వ్యవసాయ పాఠశాలలను ప్రారంభించాలని నిర్ణయించబడింది. బాపట్ల పాఠశాల 1-2-1955 లో పని ప్రారంభించింది. మొదట అది మూడు పూరి పాకలలో ఏర్పాటు చేయబడింది. తరువాత 1955 మార్చినాటికి యీ సంస్థ పక్కాభవనాలు, వసతి గృహము తయారైనవి. వాటినిర్మాణానికి యించుమించు రెండు లక్షల రూపాయలు ఖర్చుఅయినవి. పాఠశాల గుంటూరు-బాపట్ల రోడ్డు లెవెల్ క్రాసింగ్‌కు సమీపంలో 30 వ మైలువద్ద గల 25 ఎకరాల స్థలంలో నెలకొల్పబడింది. ఈ స్థలం వ్యవసాయ కళాశాలకి చెందినది. ఈ స్థలంలో ఇంచుమించు 8 ఎ. మేర భవనాలు, రోడ్లు ఉన్నాయి. మిగిలిన 17 ఎకరాలు శిక్షితుల ప్రత్యక్ష సాగు ప్రయోజనాలకు వినియోగిస్తాయి.

### పాఠ్య ప్రణాళిక.

ఈ పాఠశాలలో శిక్షణకాలంలో వ్యవసాయం, వుద్యానవనకృషి, వ్యవసాయ ఇంజనీరింగు, పశుపోషణలలో ప్రాతిపదిక పరిజ్ఞానం కల్పించబడుతుంది. ఒక సంవత్సరం అనంతరం తుది పరీక్షలో నెగ్గిన అభ్యర్థులు రాష్ట్రంలోని ఒకటి రెండు విస్తరణశిక్షణా కేంద్రాలకు పంపబడుతారు. అక్కడ ఆరు నెలల పాటు వారు విస్తరణవిధానాలలో శిక్షణ పొందుతారు.

1958 అక్టోబరు నుంచి ఈ సంస్థ గ్రామ సేవకుల శిక్షణా కేంద్రంగా అభివృద్ధి పరచబడింది. మొదటినుంచీ ఏకీకృతమైన పాఠ్యప్రణాళిక, ఏకీకృతబోధన ప్రవేశపెట్టబడ్డాయి. ఈ కోర్సు శిక్షణాకాలం మొత్తం రెండు సంవత్సరాలు.

### శిక్షణా సౌకర్యాలు

1. వ్యవసాయ క్షేత్రం.—శిక్షితులు ప్రత్యక్షంగా సాగు చేయటానికై ఇంచుమించు 17 ఎ. మెట్టభూమి ఉంది. దీనికి నీటి సరఫరా దొరువులద్వారా జరుగుతుంది. ప్రతి శిక్షితునికి కూరగాయల పెంపకానికి ఒక ఖండము, వేరుశెనగ ఆ తరువాత చోడి పెంపకానికి మరొక ఖండము కేటాయించబడతాయి. ఇది కాక కళాశాలాక్షేత్రంలోని 5 ఎకరాల మాగాణి భూమి ఈ సంస్థ శిక్షితులు ప్రత్యక్షంగా వరిని పండించటానికై కేటాయించబడింది.

2. వ్యవసాయ క్షేత్ర విస్తరణ.—ఇప్పుడీసంస్థకు అందుబాటులోగల పొలం ప్రక్కగల మరొక 60-40 ఎ. భూమిని తీసుకోవాలని సంకల్పించబడింది. ఇది వ్యవసాయ కళాశాల క్షేత్రానికి చెందినది. ఈ భూమిలో 20 ఎ. మాగాణి భూమిగా మార్చి బ్రాంచి కాలవ త్రవ్వకంద్వారా దానికి నీటి పారుదల సౌకర్యాలను కల్పించాలని సంకల్పించబడింది. ఈ 20 ఎకరాలను మట్టం చేయటానికి అంచనాలు తయారుచేయమని విజయవాడ సహాయ వ్యవసాయ ఇంజనీరు ఆదేశించబడ్డారు. జీడిమామిడి, సరుగుడువంటి చెట్ల పెంపకానికై కొంత భూమిని కేటాయించాలని సంకల్పించబడింది.

ఇటీవల ఎలక్ట్రిక్ మోటార్ పంపుసెట్టుతో ఒక ఫిల్టర్ పాయింట్ ఏర్పాటు చేయబడింది. దానికి ఒక 'స్ప్రింక్లర్' అమర్చబడింది. ఇది రమారమి 4 ఎ. భూమికి నీటిపారుదల కల్పిస్తుంది. ఈ 4 ఎకరములలోను కూరగాయలు పెంచబడగలవు.

3. తోట.—ఫలవృక్షాల పెంపకంలో శిక్షణ ఇవ్వటానికై ఇంచుమించు 3 ఎకరాలలో నిమ్మజాతి మొక్కలు. సపోటా, మామిడి, సీతాఫలం, జామి, జీడిమామిడి వగైరా మొక్కలతో ఒక తోట వేయబడింది. నారుమొక్కల పెంపకానికై అర ఎకరం భూమి విడిగా కేటాయించబడింది.

4. మ్యూజియం.—మ్యూజియంలో శిక్షితులకు, ప్రేక్షకులకు ఉపకరించే వస్తుసామగ్రి అనగా 1,000 కి పైగా నమూనాలు, చార్టులు, స్పెసిమెన్లు, ఉత్తమరకాల విత్తనాలు, క్రిమి సంహారక మైన మందులు, ఎరువులు, రసాయన ఎరువులు, భూసార పరిరక్షణ మోడల్సు వగైరా అమర్చబడినవి.

5. గ్రంథాలయం, పఠన మందిరము.—గ్రంథాలయంలో వ్యవసాయం, పశుపోషణ, తోట పెంపకం, మొక్కల రక్షణ, వగైరా విషయాలపై తెలుగు, ఇంగ్లీషు పుస్తకాలు 3,000 కి పైగా ఉన్నాయి. ఇవి సిబ్బందికి, శిక్షితులకు కూడా ఉపకరిస్తాయి. వార పత్రికలు, పక్ష పత్రికలు వగైరా ఇంచుమించు 30 తెప్పించబడతాయి.

6. సమాచార కేంద్రం.—ఇక్కడ ఫిల్మ్‌స్ట్రిప్ ప్రొజెక్టరు, బులిటన్లు, పోస్టర్లు, చార్టులు వార పత్రికలు వగైరా, చిన్న పుస్తకాలు, వార్తా బోర్డు మున్నగు విస్తరణ సాధనాలు ఉన్నాయి. గ్రామాలలో విస్తరణ కృషి విషయంలో ఇట్టి సాధనాల ఉపయోగానికై శిక్షితులకు వాటిని ఉపయోగించే పద్ధతి నేర్పబడుతుంది.

7. కోళ్ల పెంపకం యూనిట్లు.—ఇక్కడ వైట్ లెగ్ హారన్సు వగైరా 5 రకాలకి చెందిన 8 పుంజులు, 37 పెట్టలు, 112 పిల్లలు పోషించబడుతున్నాయి.

ఈ యూనిట్టును శిక్షతులే నిర్వహిస్తారు. శిక్షణ పూర్తి అయేసరికి కోళ్ల పెంపకంగురించి వారికి పూర్తిగా తెలుస్తుంది. గుడ్లు పొదుగు యంత్రాలు మూడు ఉన్నాయి. ఒకటి ప్రదర్శన ప్రయోజనాలకై తరగతి గదిలో ఉంటుంది. మిగిలిన రెండు గుడ్లు పొదగడానికి వినియోగించబడతాయి.

ఈ యూనిట్టు లాభ నష్టాలు లేని ప్రాతిపదికపై నడపబడుతున్నది. పొలం రద్దులో నాలభాగం కోళ్ల ఆహారం క్రింద ఉపయోగించబడుతుంది.

శిక్షణ ఏకీకృతపార్య ప్రణాళిక ప్రకారం రూ 40,000 లు ప్రారంభ ఖర్చుతో 50 పక్షులతో కోళ్ల పెంపకం యూనిట్టు, 10 పాడి పశువులతో పాడి పరిశ్రమ యూనిట్టులను ప్రారంభించాలని సంకల్పించబడింది.

శిక్షతులు ప్రస్తుతం పాడి పరిశ్రమ, పశువైద్య శాస్త్రిలలో ప్రత్యక్షను భవానికై వ్యవసాయ కళాశాలకు తీసుకొని వెళ్లబడుతున్నారు. ఈ సంస్థలో పని ప్రయోజనాలకై రెండు జతల ఎడ్లు ఉన్నాయి. కృషి పశువుల నిర్వహణలో శిక్షితులకు శిక్షణ ఇవ్వబడుతున్నది.

8. పశువుల ప్రథమ చికిత్సా కేంద్రం.—ఈ విషయంలో శిక్షితులకు ప్రత్యక్ష విషయాలలో తగిన శిక్షణ నివ్వటానికి పశువుల ప్రథమ చికిత్సా కేంద్రం మంజూరు చేయబడింది. అది త్వరలో ప్రారంభించబడుతుంది.

9. తేనెటీగల పెంపకం.—ఒక చిన్న తేనెటీగల పెంపకం కేంద్రం ప్రారంభించబడింది.

10. మత్స్య పరిశ్రమ.—రెండు దొరువులలో చేపలు పెంచబడుతున్నాయి. ఇవి శిక్షితులకు ప్రత్యక్ష ప్రమాణంతో శిక్షణ ఇవ్వడానికి ఉద్దేశించబడ్డాయి.

11. దృశ్య-శ్రవణ పరికరాలు.—ఒక కెమేరా, స్లైడ్ ప్రొజెక్టరు, ఫ్లానల్ గ్రాఫ్, సిల్కు ప్రింటింగు స్క్రీను, హెక్టోగ్రాఫ్, చార్టులు, పోస్టర్లు సమకూర్చబడ్డాయి.

12. వసతి సౌకర్యం.—పాఠాలు చెప్పటానికి, సిబ్బందికి, గ్రంథాలయ పఠన మందిరాలకు, కాలక్షేపానికి, సమాచార కేంద్రానికి, మ్యూజియంకు, వసతి గృహానికి, భోజనాలు వంటలకు శిక్షితులకు స్నానాలు మున్నగువాటికి విడివిడిగా వసతి వుంది.

ఏకీకృత పార్య ప్రణాళికకు తగినట్టు భవనాల విస్తరణ కార్యక్రమం జరుగుతున్నది. అదనపు అవసరాలకు అనుగుణంగా వర్కుషాపు, పాడి పరిశ్రమ కేంద్రం, పశువుల కొట్టాలు, స్టోర్సు ఆడిటోరియం మున్నగువాటిని నిర్మించవలసి ఉంది.

సిబ్బంది గృహాల నిర్మాణానికి అనుమతి సంపాదించబడింది. ఇంక నిర్మాణాన్ని చేపట్టాలి.

శిక్షితులు.—ఈ శిక్షణ పొందటానికి అభ్యర్థులు ఎస్. ఎస్. ఎల్. సి. లేక మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై 18—28 సంవత్సరాలమధ్య వయస్కులై ఉండాలి. శిక్షితులను ప్రభుత్వం ఏర్పాటు చేసిన సెలెక్షన్ కమిటీ ఎన్నుతుంది. ఎన్నికకుముందు ఇంటర్వ్యూ ఉంటుంది. ఈ సంస్థలో చేరిన నెలకు శిక్షణకు తగని వారినందరినీ సిబ్బంది కమిటీ తొలగిస్తుంది.

వసతి గృహంలో 120 మందికి వసతి ఉంది. సామాజిక జీవనాన్ని ప్రోత్సహించటానికై శిక్షితులు 6 గదులలో ఉంచబడతారు. శాకాహారులకు, మాంసాహారులకు విడివిడిగా వంటలు జరుగుతాయి. వాటిని డిప్యూటీ వార్డెను సహాయంతో శిక్షితులే నిర్వహిస్తారు.

శిక్షితులకు ఏకీకృత పార్య ప్రణాళిక కొత్త పథకం క్రింద సంస్థలలో వారి ఖర్చుకు నెలకి రూ 40 లు స్టయిపెండు ఇవ్వబడుతుంది.

ఈ సంస్థ పని ప్రారంభించి ఇప్పటికి నాలుగు సంవత్సరాలయింది. ఇంతవరకు 4 జట్టులకు శిక్షణ ఇవ్వబడింది. మొదటి ఏడాది రెండు జట్టులు ఆరేసి నెలలు శిక్షణ పొందగా 3, 4 జట్టులు పూర్తిగా సంవత్సరం శిక్షణ పొందాయి. ప్రస్తుతపు జట్టు ఐదవది. ఇది రెండు సంవత్సరాల ఏకీకృత పార్య ప్రణాళిక క్రింద శిక్షణ పొందుతున్నది. ఈ శిక్షణ 1960 మార్చిలో పూర్తి కాగలదు.—

| జట్టు. | శిక్షణ పొందినవారి సంఖ్య. | శిక్షణ పొందిన కాలం. |
|---|---|---|
| మొదటి జట్టు | 116 | ఇంచుమించు 6 నెలలు. |
| రెండవ జట్టు | 118 | ఇంచుమించు 6 నెలలు. |
| మూడవ జట్టు | 113 | ఒక సంవత్సరం. |

| | | |
|---|---|---|
| నాలుగవ జట్టు | 137 | ఒక సంవత్సరం. |
| ఐదవ జట్టు | 100 | ఇంకా శిక్షణ పొందుతున్నారు. |

సాంస్కృతిక కార్యకలాపాలు.—శిక్షితుల కళాభిరుచిని ప్రోత్సహించటానికి, సభలు ఏర్పాటు చేయటం, ఉపన్యాసాలు ఇవ్వటం పంచవర్ష ప్రణాళిక, సమాజాభివృద్ధి కార్యకలాపాలకు సంబంధించిన ప్రచార విషయాలను తయారుచేసి ప్రచురించటం వారికి నేర్పటానికి ఒక సాంస్కృతిక సంఘం ఏర్పాటు చేయబడింది. శిక్షితులు ప్రచార విషయాలను వ్రాస్తారు. నాటక ప్రదర్శనలు ఇస్తారు. బుర్ర కథలు వగైరా చెబుతారు. , ఒక వ్రాత పత్రిక కూడా నడుపబడుతున్నది. దాని నిమిత్తం వారు ప్రణాళిక మున్నగు వాటిక్రింద జరిగే కార్యకలాపాలపై వ్యాసాలు వ్రాస్తారు. ఈ పాఠశాలకు ఒక రేడియో, సంగీత వాయిద్యాలు మున్నగునవి ఉన్నాయి.

శిక్షితులతో సన్నిహిత సంబంధం ఏర్పరుచుకొనటానికై ట్యుటోరియల్ పద్ధతి అవలంబించబడుతున్నది.

శిక్షితులకు ఆటలకు వసతి ఉంది. వ్యాయామ శిక్షకుడు వారికి ఆటలలో శిక్షణ నిస్తాడు. ఈ పాఠశాల శిక్షితులు 1957 జనవరిలో రెవిన్యూ క్రీడలలో పాల్గొని యీ శాఖ ప్రణాళికల విభాగం షీల్డు గెలుచుకొనటానికి తోడ్పడ్డారు.



## రచయితలకు

ఈ పత్రికలో ప్రకటనార్థం సంస్కృతి, సాహిత్యం, కళలు, శిల్పం, దర్శనీయమైన స్థలాలు మొదలైన వాటిపై స్వతంత్ర రచనలు కావాలి. విషయం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి ప్రత్యేక ప్రాముఖ్యంకలదై వుండాలి. వీలైనప్పుడల్లా వ్యాసాలతోపాటు ఛాయాచిత్రాలు లేక రేఖాచిత్రాలను పంపవచ్చు. అంగీకరించబడిన రచనలన్నిటికి పారితోషికం యివ్వబడుతుంది.

సమాచార, పౌర సంబంధములశాఖ డైరెక్టరు

# ఆంధ్రలో ఖాదీ వస్త్రోత్పత్తి

అధిక వేతనాలు కావాలని నేత పనివారు అదేపనిగా కోరుతున్నప్పటికీ, ఇటీవల ఖాదీలో అనేకరకాల ధరలను తగ్గించటం సాధ్యమైంది. ఈ విషయంలో ఆంధ్రలో యీ పరిశ్రమకు అధ్వర్యం వహిస్తున్నవారి గట్టి కృషి ప్రశంసనీయ మైనది. గడచిన ఆరు సంవత్సరాలలోను ఉత్పత్తి, అమ్మకాలు, నమూనాలు, రకాలలో క్రమాభివృద్ధి సాధించబడింది. వివరాలు దిగువ ఇవ్వబడినవి.

ఆంధ్ర ఎప్పుడూకూడా ఖద్దరుకి ప్రసిద్ధమైనదే. ఆంధ్రలో మొదట అఖిల భారత చర్ఖా సంఘము తరువాత అఖిల భారత సర్వసేవా సంఘము ఖాదీ వస్త్రోత్పత్తికి సంబంధించిన పనిని చేశాయి. ఈ సంఘంనుంచి పూర్వ అఖిల భారత ఖాదీ గ్రామ పరిశ్రమల బోర్డు యీ పనిని తీసుకొన్ననాటి నుంచి అనగా 1-12-53 నుంచి (ఆతరువాత 1957 ఏప్రెల్‌లో ఖాదీ గ్రామ పరిశ్రమల కమిషన్ ఏర్పడిననాటినుంచి) యీ కార్యక్రమం వివిధ శాఖలలో తగినంత అభివృద్ధి సాధించబడింది. కొత్త కేంద్రాలు తెరువబడ్డాయి. కొత్త ప్రాంతాలలో అమ్మకాలు జరుపబడ్డాయి. రాయలసీమలో ఖాదీ అభివృద్ధికి చాల అవకాశా లున్నా, మొదట్లో అవి పూర్తిగా వినియోగించుకోబడ లేదు. ఎందువల్లనంటే అప్పట్లో అక్కడ అధిక సంఖ్యలోగల నూలువడికేవారిని, ఖాదీ నేతపనివారిని ఉపయోగించుకోటానికి తగిన సిబ్బంది, పెట్టుబడి లేకపోయాయి.

ఈ ఆరు సంవత్సరాలలోను, పూర్వ అఖిల భారత ఖాదీ గ్రామ పరిశ్రమల బోర్డు ఖాదీలో ప్రత్యక్ష వ్యాపార కార్య కలాపాలకు పూనుకున్ననాటినుంచి అటుపిమ్మట 1-4-57 న ఖాదీ గ్రామ పరిశ్రమల కమిషన్ దాని పనిని తీసుకున్ననాటినుంచి ఆంధ్రలో ఖాదీ కార్యకలాపాల రంగం విస్తరిల్లి మారుమూల ప్రదేశాలు అభివృద్ధి చెందాయి.

ఆంధ్రలో నేతపనివారు ఎప్పుడూ అధిక వేతనాలనే కోరతారు. ఇదే ఇక్కడ ముఖ్యమైన ఆటంకం. ఇందువల్ల ఖాదీ ధర హెచ్చటం తత్ఫలితంగా వ్యాపారాభివృద్ధి కుంటుపడటం జరిగేది. ఈ ఆటంకం ఉన్నప్పటికీ ప్రత్యేక రకాల తయారీ, ఖాదీని ఎక్కువ ప్రాంతాలకు అందుబాటు చేయటాలద్వారా అమ్మకాలు నానాటికి హెచ్చించబడినవి.

ఈ ఆరు సంవత్సరాలలోను వస్త్రోత్పత్తి, క్రయ విక్రయాలు, క్రమంగా హెచ్చాయి.

ఉద్యోగ వసతిలోకూడా గమనార్హమైన అభివృద్ధి కనబడింది. 1953–54 లో 13,788 మంది నూలు వడుకువారు, నేతపని వారు, తదితరులకి పని కల్పించబడింది. 1958–59 లో యీ సంఖ్య 68,011 కి హెచ్చింది. అలాగే 1953–54, 1954–55 లలో చెల్లించబడిన వేతనాలు రూ 13,56,825 కాగా 1958–59 లో వేతనాల క్రింద రూ 37,21,171 లు చెల్లించబడినవి. 1953–54 లో 13 వస్త్రోత్పత్తి కేంద్రాల

క్రింద 648 గ్రామాలుండగా 1958–59 కి 68 కేంద్రాలక్రింద 2,364 గ్రామాలున్నాయి.

## నిపుణులు.

వస్త్రోత్పత్తి రంగంలో ప్రత్యేకించి పేర్కొనదగిన అభివృద్ధులు కొన్ని ఉన్నాయి. ఇదివరకు కుప్పాడం చీరలు పట్టులోనే తయారయేవి. 1921 నుంచి పలనాడు కుప్పాడం రకాలు ముతక నూలులో నేయబడేవికాని మధ్య కొంతకాలం ఇది మానివేయబడింది. 1954 లో యీనేత తిరిగి చేపట్టబడింది. మాచెర్ల చీరలు బాగా జనాదరణ పొందుతున్నాయి. అలాగే కుప్పాడం ధోవతులు, ఖండువాలు, పిఠాపురం సాదా డిజైన్ అంచులవికూడా. ఈ అంచులలో పువ్వులు, పిట్టలు నూలుతో నేయబడతాయి. వీటిని ఏవిధమైన ప్రత్యేకశ్రద్ధ అవసరంలేకుండా మామూలువాళ్లు ఉతకవచ్చు. తాడిపత్రి, ధర్మవరాల (అనంతపురం జిల్లా) లో కోటు గుడ్డలు, చొక్కా గుడ్డలనేత పునఃప్రారంభించబడింది.

ఇదివరకు రంగులు, అద్దకాల పనులు, ప్రైవేటు రంగు పరిశ్రమ వారిచే చేయించబడేవి. ఇప్పుడు ఆ పనులు సరాసరి జరుపబడుచున్నవి. స్క్రీన్ ప్రింటింగ్, స్ప్రే ప్రింటింగ్ పద్ధతులు ప్రవేశపెట్టబడుతున్నాయి.

పట్టు వస్త్రోత్పత్తి రంగంలో, ధర్మవరం పట్టు కేంద్రం తెరువబడింది. సాదా రకాలు, కుప్పాడం రకాలు, మిగిలిన అన్ని రకాలుకూడా వంచె (రీల్డ్) పట్టులో నేయబడుతున్నాయి. వీటి నాణ్యం, రకాలు, రంగు, మన్నికలు మిక్కిలి ఉన్నత ప్రమాణంలో ఉన్నందున అవి సర్వత్రా బాగా చెల్లిపోతున్నాయి. ఈనాడు ధర్మవరం దేశంలో నాణ్యమైన పట్టు తయారీకి ప్రసిద్ధికెక్కింది.

ఉన్ని వస్త్రాల విషయంలో, 1956 లో పూర్వపు బోర్డు ప్రయోగాలు జరిపింది. ఈ సంవత్సరం మామూలు తయారీ ప్రారంభించబడుతున్నది. ఆంధ్రలో అన్నిరకాల కంబళ్ల తయారీకి విస్తారమైన అవకాశాలున్నాయి.

ఇంతవరకు ఖాదీ కార్యక్రమంలేని అనపర్తి ప్రాంతంలో అంబర్ నూలుతో కుప్పాడం, సాదా, ఖాటాన్ మొదలైన అన్ని రకాలు నేయబడుతున్నాయి. అంబర్ చర్ఖా ప్రవేశపెట్టటంవల్ల దీనిని పూర్తి వస్త్రోత్పత్తి కేంద్రంగా మార్చటం సాధ్యపడింది.

అంబర్ కార్యక్రమం క్రింద, అంబర్ నూలు వడుకుట బాలాజీపేట, తూములూరు, తాడిపత్రిలలో నమూనా కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. నేతకూడా చేపట్టబడుతుంది. నేత ఆధునిక పద్ధతులన్నీ అక్కడ ప్రదర్శించబడతాయి.

అంబర్ రాకతో ఖాదీ వస్త్రోత్పత్తి రంగంలో ఒక నూతనశకం ఆరంభమైంది. మొదట్లో అంబర్ చర్ఖా నూలు ఒకచోట పురి ఎక్కువగాను, మరొకచోట తక్కువగాను ఉంటూఉండేది. అలవామైనకొద్దీను, కొత్త పద్ధతులు ప్రవేశపెట్టిన మీదట నూలు నాణ్యం గమనార్హంగా హెచ్చింది. మామూలు మిల్లు నూలు నేతపనివారు అంబర్నూలుతో తేలిగ్గానేస్తారు. ఇందువల్ల "పుంజముల"లో నేత మజూరీలను చుట్టుపట్ల రాష్ట్రాలలో యిదివరకే ఉన్న స్థాయికి తగ్గించటానికి వీలుపడింది. ఇప్పుడు బట్టల ధరలుకూడా తదనుగుణంగా తగ్గాయి.

ఈ సంవత్సరం వస్త్రాల ధరలను మార్చి తద్వారా మధ్య రకాల వస్త్రాల ధరలు తగ్గించబడినవి. 14 నెంబరు 18 పుంజం 54 అంగుళముల వెడల్పు అన్‌బ్లీచ్డు ఖాదీ గజం ధర రూ 2·16 న.పై. నుంచి రూ 2·07 న.పై. తగ్గింది. అదే వెడల్పులో 32 నెంబరు 28 పుంజం అన్‌బ్లీచ్డు బట్ట ధర గజానికి 33 న.పై. తగ్గింది. ఇది గజం రూ 3·61 న.పై. అమ్మేదల్లా రూ 3·28 న.పై. అమ్ముతున్నది.

కోరా ధోవతులు, బ్లీచ్డు బట్టల ధరలుకూడా తగ్గాయి. ఉదాహరణకు, కోరాధోవతులకు ఇంచుమించు ఒక రూపాయవరకూను కండువాలకు 40 న.పై. వరకూను, బ్లీచ్డు ఖాదీ రకాలకు 35 న.పై. వరకూను తగ్గాయి.

స్థానిక అమ్మకాలను హెచ్చించటానికై ఉత్పత్తిపై తగ్గింపు ఓవర్‌హెడ్ (మార్జిన్) ల రూపంలో స్థానిక ప్రజలకు ప్రత్యేక సౌకర్యాన్ని కల్పించి తక్కువ ధరకు ఖాదీ అందుబాటు చేయబడుతున్నది. అలాగే చేతిపనివారికి కొన్ని రకాలు తగ్గింపు ధరలకు ఇవ్వబడుతున్నాయి.

ఆంధ్రలో అంబరు కార్యక్రమం విశిష్టమైన ప్రగతిని సాధించింది. ప్రారంభమైన నాలుగు సంవత్సరాలలోనూ అది ఎలా విస్తరిల్లినదో సమగ్రంగా వివరించే పట్టీ అనుబంధంలో ఇవ్వబడింది.

# ఆంధ్రలో ఖాదీ వస్త్రోత్పత్తి

## ప్రగతి వివరాలు.

| వరుస సంఖ్య. | సంవత్సరాలు. | ఉత్పత్తి | | అమ్మకం | | పని కల్పించబడిన [illegible] సంఖ్య. | [illegible] | ఉత్పత్తి కేంద్రాల సంఖ్య. | అమ్మకం డిపోల సంఖ్య. | [illegible] సంఖ్య. | పని కల్పించబడిన [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | చ. గజాలు. | విలువ. | [illegible] | [illegible] | | | | | | | |
| (1) | (2) | (3) | | (4) | | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) |
| | | | రూ. | రూ. | | | రూ. | | | | | రూ. |
| 1. | 1953–54 | 92,266 | 2,02,486 | 1,49,784 | 7,35,770 | 90 | 1,53,558 | 13 | 16 | 648 | 13,788 | 13,56,825 |
| 2. | 1954–55 | 8,62,406 | 17,93,400 | 6,04,694 | | 217 | | 17 | 19 | 709 | 20,061 | |
| 3. | 1955–56 | 11,75,850 | 27,70,328 | 9,01,951 | 13,46,202 | 500 | 2,73,242 | 25 | 24 | 751 | 49,624 | 21,24,624 |
| 4. | 1956–57 | 18,37,787 | 39,36,289 | 36,83,565 | 15,65,027 | 587 | 3,90,697 | 34 | 25 | 891 | 47,464 | 23,46,165 |
| 5. | 1957–58 | 18,97,841 | 40,35,035 | 34,98,909 | 10,56,981 | 962 | 6,40,072 | 60 | 29 | 1,507 | 57,637 | 23,00,878 |
| 6. | 1358–59 | 29,90,058 | 60,85,186 | 36,68,928 | 35,06,923 | (లేదు) | ... | 68 | 39 | 2,364 | 68,011 | 37,21,171 |

## అంబర్ చర్ఖా కార్యక్రమం వివరాలు.

| వివరాలు. (1) | | 1955–56 (2) | 1956–57 (3) | 1957–58 (4) | 1958–59 (5) |
|---|---|---|---|---|---|
| | | | **శిక్షణ, ఉద్యోగవసతి, వేతనాలు, బోధకులు.** | | |
| 1. నడిచిన విద్యాలయాల సంఖ్య | ... | 1 | 1+1 | 2+2 | 4+1 |
| 2. చేర్చుకోబడిన అభ్యర్థులు | ... | 40 | 232 | 155 | 253 |
| 3. శిక్షణ పూర్తిచేసిన అభ్యర్థులు | ... | | 195 | 149 | 248 |
| 4. బోధకులుగా నియమితులైన వారి సంఖ్య | ... | | 195 | 149 | 248 |
| | | | **నూలు వడుకువారు.** | | |
| 1. నడిచిన శిక్షణాలయాలు (సెషన్స్ లెక్కలో) | ... | | 22 | 237 | 470 |
| 2. శిక్షణపొందిన నూలు వడుకువారు | ... | | 5,546 | 7,243 | 6,934 |
| 3. పంపిణీ అయిన చర్ఖాలు | ... | | 4,338 | 7,158 | 7,157 |
| | | | **ఉద్యోగవసతి.** | | |
| పని కల్పించబడిన నేత పనివారు | ... | | 603 | 2,747 | 3,147 |
| | | | **చెల్లించబడిన వేతనాలు.** | | |
| 1. నూలు వడుకువారు రూ. | ... | | 69,318 | 2,81,948 | 6,73,077 |
| 2. నేత పనివారు ,, | ... | | 13,592 | 4,07,856 | 12,46,266 |
| 3. ఇతరులు ,, | ... | | .... | 21,360 | 8,721 |
| | | | **ఉత్పత్తి.** | | |
| 1. నూలు - పౌనులు | ... | | 34,659 | 1,41,699 | 250,008 |
| 2. అంబర్ వస్త్రం.— | | | | | |
| 1. శుద్ధ అంబర్ - చ. గజాలు | ... | | 14,506 | 43,145 | 1,71,103 |
| 2. మిశ్రమ అంబర్ - చ. గజాలు | ... | | 12,678 | 9,89,985 | 28,03,228 |
| 3. సరంజాం కార్యాలయాలలో తయారైన అంబర్ సెట్లు (చిన్నా పెద్దా) | | | 503 | 1,010 | 3,689 |



# బెల్లం, ఖండసరి పరిశ్రమ అభివృద్ధి

బెల్లం, ఖండసరి (పటిక బెల్లం) వ్యవసాయ పరిశ్రమను కొన్ని ముఖ్య సమస్యలు ఎదుర్కొంటున్నాయి. అవి ఇవి-ఆధునిక నిలవ సౌకర్యాలు, మిగులు సరుకు విదేశాల ఎగుమతికి అవకాశాలు, సరసమైన ధరలకు ఆధునిక పరికరాలు, ప్రాంతీయ పరిశోధన. 31-7-1959 న కాకినాడలో జరిగిన తృతీయ అఖిలభారత బెల్లం, ఖండసరి సమావేశం సందర్భంలో అధ్యక్షోపన్యాసంయిస్తూ రాష్ట్ర దేవ ధర్మాదాయ, పరిశ్రమల శాఖా మంత్రి శ్రీ ఎ. భగవంత రావు వీటివిషయం ప్రత్యేకించిచెప్పారు.

భారత దేశంలోని వ్యవసాయ పరిశ్రమలన్నిటిలోను బెల్లం, ఖండసరి పరిశ్రమ మిక్కిలి ముఖ్యమైనదని చెప్పవచ్చునన్నారు. ఆయన ఇంకా ఇలాఅన్నారు. "వ్యవసాయం తరువాత యిది మిక్కిలి పెద్ద పరిశ్రమ. సంవత్సరంలో ఇంచుమించు 4-5 నెలలు బహు సంఖ్యాకులకు నిరంతరాయంగా పనికల్పిస్తుంది. దేశంలో పండిన చెఱకులో 60 శాతానికిపైగా యీ పరిశ్రమలో ఖర్చు అవుతుంది. మళ్లీదేశంలోని వాక్యూం పాన్ పంచదార ఫాక్టరీలన్నీకలిసి మొత్తం 25 శాతం కంటె ఎక్కువ వాడలేవు. దీనినిబట్టి యీ పరిశ్రమ ప్రాముఖ్యం విదితం కాగలదు. ఈ పరిశ్రమలో ఏటా 25 లక్షల టన్నులబెల్లం, ఖండసరి తయారవుతాయి. వీటి విలువ రూ 100 కోట్లు మించుతుంది. దేశంలో తీపి అవసరాలలో అత్యధికభాగం యీ పరిశ్రమద్వారానే తీరుతాయి. 1932 లో రక్షణ కల్పించబడిన పిమ్మట పంచదార పరిశ్రమ శర వేగంతో విస్తరిల్లినా అందువల్ల బెల్లం పరిశ్రమకేమీ దెబ్బ తగలలేదని చెప్పవచ్చును. దేశంలో బెల్లం పరిశ్రమకు యెప్పుడూ అధిక ప్రాధాన్యతఉంది. అది ఇకముందుకూడా కొనసాగుతుంది. ఈ విధంగా దేశ గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణానికి యీ పరిశ్రమ అభివృద్ధితో సన్నిహిత సంబంధం ఉంది.

బెల్లం పెద్ద ఎత్తున తయారవుతున్నప్పటికి మన తయారీ పద్ధతులు మాత్రం అభివృద్ధికాలేదు. పురోగమించిన వైజ్ఞానిక, సాంకేతిక విషయాలు పూర్తిగా చెఱకు ఉత్పత్తిదారులకు అందనందున వారు తమ పరిశ్రమను వైజ్ఞానిక పద్ధతులలో నడుపుకొని పూర్తిలాభాలను పొందలేక పోతున్నారు. ప్లానింగు కమిషన్‌చే నియమింపబడిన కార్యేకమిటీ యీ విధంగా అంది.—

"బెల్లం పరిశ్రమకు ప్రజలకు అది కల్పించేపనిదృష్ట్యా ప్రత్యేక ప్రాముఖ్యమున్నది. రైతులలో చాలమంది ఉపవృత్తిగా బెల్లం తయారీని చేపడతారు.

"దేశం చాల ప్రాంతాలలో బెల్లం పరిశ్రమకు ప్రధానంగా రెండు ప్రతిబంధకాలున్నాయి. సాంకేతికంగా, అసమర్థమైన పరికరాలు, వెనుకబడిన తయారీ పద్ధతులు, విక్రయం విషయంలో నిలవకు, బంగీలు కట్టటానికి, నాణ్యం ప్రమాణాలస్థిరీకరణకు తగిన ఏర్పాటులేవు. కాబట్టి బెల్లం పరిశ్రమ అభివృద్ధి కార్యక్రమంలో యీ రెండూ ప్రధాన ఆశయాలుకావాలి. ఒకటి, విద్యుచ్ఛక్తి గానుగలు, ఆధునిక పెనాలు, తదితర పరికరాలు ప్రవేశపెట్టబడటం, రెండు, సరుకు నాణ్యం అభివృద్ధికి, సరైన నిలవ, బంగీ సౌకర్యాలకల్పనకు, నాణ్యం ప్రమాణాలస్థిరీ కరణకు తగిన చర్యలు తీసుకోబడటం.. ...."

"1955 లో అఖిల భారత ఖాదీ, గ్రామ పరిశ్రమల బోర్డు (ఇప్పుడు కమిషన్) జాతివిస్తృతంగా బెల్లం పరిశ్రమ అభివృద్ధికి ఒకపథకంతో ముందుకు వచ్చింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో దానిఅమలుకు రూ 8 కోట్లు కేటాయించబడ్డాయి.

"ఇప్పుడు మనం మరొక ఘట్టం చేరుకున్నాం. ఇక్కడ ఆగి ఇదివరలో జరిగినపనినిచూసుకుని, ఉద్యోగవసతి, ఆర్థిక విషయాలు, సాంకేతిక పరిజ్ఞానం, ఉత్పత్తి ఆధునిక పద్ధతుల దృష్ట్యా మనమవలంబించవలసిన విధానాన్ని గురించి పునరాలోచన చేసుకుని తృతీయ పంచవర్ష ప్రణాళికవిధానాలను, కార్యక్రమాలను నిర్ణయించుకోవాలి ఇంతవరకు సాధించిన ఫలితాలదృష్ట్యా ప్రస్తు

తపు విధానాన్ని, కార్యక్రమాలను పునః పరిశీలించటం యీ సమావేశం కర్తవ్యం అని నేను భావిస్తున్నాను. మనం సాధించిన ఫలితాలను, పొందిన వైఫల్యాలను ఎక్కువ విమర్శనాత్మకంగా సమీక్షించుకొంటే తృతీయ పంచవర్ష ప్రణాళికకు విస్పష్టమైన విధానాన్ని, కార్యక్రమాన్ని ఏర్పరుచుకోవచ్చును. కాబట్టి మీరు తప్పక అలాచేయాలని నైతముఅంటున్నాను.

## రాష్ట్రంలో బెల్లం, ఖండసరి పథకం

"ఆంధ్ర ప్రదేశ్‌లో బెల్లం, ఖండసరి పథకం 1955 నుంచి అమలు జరుగుతున్నది. మన రాష్ట్రంలో చెఱకు పండే మొత్తం 1·76 లక్షల ఎకరాలలోను ఇంచుమించు 44,000 ఎకరాలు వాక్యూం పాన్ పంచదార ఫ్యాక్టరీలకు కేటాయించబడతాయి మిగిలిన 1,32 లక్షల ఎకరాలలోను ఇంతవరకు ఇంచుమించు 30,000 ఎకరాలు బెల్లం, ఖండసరి పథకం క్రిందకు తేబడినవి. మిగిలిన లక్ష ఎకరాలు అలాగే ఉన్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద ఆంధ్ర ప్రదేశ్‌లో యీ పరిశ్రమ అభివృద్ధికై రూ 30 లక్షలు కేటాయించ బడ్డాయి. ఇందులో యింతవరకు మన రాష్ట్రానికి ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ నుంచి రూ 9·74 లక్షలుమాత్రమే లభించాయి. జరిగే ఆర్థిక సంవత్సరంలో రూ 6 లక్షల కేటాయింపుకై యీ కమిషన్‌కి ప్రతిపాదనలు పంపబడ్డాయి. కాని రాష్ట్రానికి రూ 2·68 లక్షలు మాత్రమే అందాయి. ఈ పథకం క్రిందగల ప్రాంతంలో అత్యధిక భాగం సమాజాభివృద్ధి ప్రాంతాలలో వున్నందున యింతే యివ్వబడిందని చెప్పబడింది. ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ యిచ్చిన సొమ్ము మొదట ప్లానింగ్ కమిషన్ కేటాయించిన మొత్తంకంటె చాల తక్కువైనందున అది రాష్ట్రాల అవసరాలకు చాలలేదు. కాబట్టి ద్వి. పం. ప్రణాళికలో యీ పరిశ్రమకు నిర్ణయించబడిన లక్ష్యాలు సిద్ధించలేదు. ఐతే రాష్ట్రంలో 5,700 ఆధునిక కొలుములు నిర్మించబడ్డాయి. 363 ఆధునిక ఎద్దు గానుగలు, 67 విద్యుచ్ఛక్తి గానుగలు, 375 పెనాలు, 208 గ్రేలెంగ్సు, 260 వడపోత సాధనాలు ప్రవేశ పెట్టబడినవి. ఈ విధంగా మనం యీ పరిశ్రమాభివృద్ధికి ఆవగింజలో అర సగం పని మాత్రమే చేశాం.

ఈ పరిశ్రమాభివృద్ధి ఎక్కువగా పథకాలకు జరిగే ధనసహాయం స్వభావంపై ఆధారపడి వుంటుందని చెబుతూ మంత్రిగారు యిలా అన్నారు.

"బెల్లం నిలవకు ప్రత్యేక రకం గిడ్డంగులు అవసరం కాబట్టి నిలవ సౌకర్యాలు చాల ముఖ్యం. ఇక్కడ ఆంధ్రలో మనం బెల్లం నిలవకు "పొగరకం" గిడ్డంగి అనే దానిని వాడుతున్నాం. ఆంధ్రకి పనికివచ్చినది యితర రాష్ట్రాలకు పనికిరాక పోవచ్చు కాబట్టి వివిధ ప్రాంతాలకు తగిన గిడ్డంగి రకం పరిశీలనకు ఒక కార్యక్రమాన్ని రూపొందించమని, ప్రధాన వ్యాపార కేంద్రాలలో పెద్ద గిడ్డంగులుకాక వివిధ చెరకు వుత్పత్తి కేంద్రాలలో చిన్నచిన్న గిడ్డంగుల నిర్మాణానికి తగిన సూచనలు చేయమని యీ సమావేశానికి నేను సూచిస్తున్నాను. అఖిల భారత సరకుల నిల్వ సంస్థ కల్పించిన సరుకుల నిల్వ, గిడ్డంగి సదుపాయాలను వినియోగించుకొనే మార్గాన్నికూడా యీ సమావేశం పరిశీలించవచ్చు.

"మిగులు బెల్లాన్ని విదేశాలకు ఎగుమతిచేస్తే ఎంతో అవసరమైన విదేశీద్రవ్యం లభించటమేకాక రైతుకి సరసమైన ధరకూడా గిడుతుంది. ఈ విషయాన్ని బహుశ్రద్ధగా పరిశీలించి, దూరప్రాచ్య, మధ్య ప్రాచ్య దేశాలలో వ్యాపార పరిస్థితులను పరిశీలించి ఎగుమతికి తగిన ప్రతిపాదనలను తయారు చేయటానికి ఆ దేశాలకు ప్రతినిధి వర్గాన్ని పంపటానికి వీలుపడుతుందేమో యీ సమావేశం చూడవచ్చునని నేను సూచిస్తున్నాను.

"వివిధ దశలలో తయారీ విధానాన్ని అభివృద్ధి పరచటానికి ప్రాంతీయ పరిశోధనా కేంద్రాల ప్రారంభానికి విపులమైన కార్యక్రమం తయారు చేయటం అత్యవసరం. చెరకు సాగు వ్యవసాయాంశాలను పరిశీలించి, అభివృద్ధిని సాధించటానికి వివిధ రాష్ట్రాలలో వ్యవసాయ పరిశోధనా కేంద్రాలున్నమాట వాస్తవమే. కాని బెల్లం, ఖండసరి తయారీ విధానాన్ని, వాటి నిలవ, విక్రయ సౌకర్యాలు మున్నగు వాటిని పరిశీలించే ప్రాంతీయ పరిశోధనా కేంద్రాలు కావాలి.

"ఆధునిక పరికరాలు సరసమైన ధరలకు సరఫరా కావాలి. ప్రస్తుతం యీ పరిశ్రమ ఎదుర్కొనే మరొక సమస్య యిది. ఈ సందర్భంలో స్థానికుల నైపుణ్యాన్ని వినియోగించుకోవాలి. చెరకు వుత్పత్తిదారుని అవసరాల కనుగుణంగా పనిచేయటానికి దేశవాళీ పనివారికి ప్రోత్సాహమివ్వాలి. అప్పుడే యిది సాధ్య పడుతుంది. చిన్నరకం పరిశ్రమల అభివృద్ధి కార్యక్రమం క్రింద దేశమంతటా పెక్కు ఫౌండ్రీలు లేస్తున్నాయి. ఈ సమావేశం యీ విషయాన్ని గుర్తించి అందుబాటులోవున్న సౌకర్యాలను అధికంగా వినియోగించుకోటానికి తగిన సిఫార్సులను చేస్తుందని నమ్ముతాను.

## విద్యుచ్ఛక్తి వాడకం

"ఖండసరి పరిశ్రమ బెల్లం పరిశ్రమలో ఒక ముఖ్య భాగం. "రాబ్" తయారీ వరకూ అన్ని పనులు సరిగ్గా బెల్లం తయారీలో వలెనే జరుగుతాయి. ఆ తరువాత బెల్లంపాకు నుంచి పటిక బెల్లం ముక్కల్ని విడదీయటానికి షుగర్ "సెంట్రిఫ్యూగల్" మాత్రం అవసరమవుతుంది. ఈ పద్ధతిలో లభించిన బెల్లం పాకును తినవచ్చు. అంది ఎంతో పుష్టికరమైన ఆహారం. దానిని చెరకు రసంతో కలిపి వుడకబెట్టి పాకు బెల్లాన్ని తయారు చేయవచ్చు. కొన్ని ప్రాంతాలలో యిది బాగా చెల్లుతుంది. పటిక బెల్లం ధరకు, మిల్లు పంచదార ధరతో సంబంధం వుంటుంది. కాబట్టి చెరకు వుత్పత్తిదారుకు బెల్లం ధర సుముఖంగా లేనప్పుడు ఖండసరి తయారీని సులభంగా చేపట్టవచ్చు కాని బెల్లం, ఖండసరి పథకం క్రింద చేతి సెంట్రిఫ్యూగల్ యంత్రాల స్థాపనకే ఆర్థిక సహాయం లభిస్తుంది. ఆచరణలో యీ చేతి యంత్రాలపని చాల అసమర్ధంగా వుంటుందని కనుగొనబడింది. ఇప్పుడు నాకు మన కుటీర, గ్రామ

పరిశ్రమల అభివృద్ధికి విద్యుచ్ఛక్తిని వాడవచ్చా కూడదా అన్న సాధారణ సమస్య ఎదురవుతున్నదని తెలుసు. శీఘ్రగ్రామీణ విద్యుదీకరణ ధర్మమా అని పల్లెప్రాంతాలలో చవుకగా కావలసినంత విద్యుచ్ఛక్తి లభ్యం కావచ్చు. రైతుకు విద్యుచ్ఛక్తి వినా పని జరగని రోజులు వచ్చాయి. మన రాష్ట్రంలో చెరకు ఎకరా వుత్పత్తి 30 టన్నులు మించుతుంది. చెరకు వుత్పత్తిదారుడు విస్తారమైన చెరకును పరిమితమైన కాలంలో వినియోగించుకోవాలి అదే సమయంలో యితర వ్యవసాయ పనుల్ని చూసుకోవాలి. కాబట్టి బెల్లం, ఖండసరి తయారీలో విద్యుచ్ఛక్తిని విస్తృతంగా వాడటం అవసరం. ఇటువంటి కుటీర పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిని వాడితే సామర్థ్యం, నాణ్యం హెచ్చటమేకాక వుద్యోగ వసతి అవకాశాలుకూడా హెచ్చుతాయి. కాబట్టి, యీ సమావేశం యీ అంశాలను పరిశీలించి, సెంట్రిఫ్యూగల్ యంత్రాల విషయంలోనేకాక తయారీ అన్ని దశలలోను విద్యుచ్ఛక్తి యితోధిక వాడకానికి నిర్దిష్టమైన ప్రతిపాదనలు చేస్తుందని నమ్ముతాను.

"కుటీర పద్ధతి తయారీలో ఖండసరిని 5—5·5 శాతం మాత్రమే తీయటం పడుతుంది. వాక్యూం పాన్ పంచదార ఫ్యాక్టరీలలో సాధ్యపడే శాతం 10. ఇటీవల సంవత్సరాలలో కొంత పరిశోధన జరిగింది. దానిలో అవలంబింపబడిన సల్ఫిటేషన్ పద్ధతి ప్రకారం 7·5 శాతం వరకూ సాధించవచ్చు. ఉత్తర ప్రదేశ్ వంటి రాష్ట్రాలలో యీ పద్ధతి నవలంబించిన చిన్న చిన్న ఫ్యాక్టరీలు పెక్కు అప్పుడే ఏర్పడ్డాయి. గడచిన ఏడాది ఆంధ్ర ప్రదేశ్‌లో అట్టి యూనిట్లు 3 ఏర్పాటు చేయబడ్డాయి. ఒక్కొక్కటి రోజుకు 40టన్నుల చెఱకును ఆడగలవు. అందులో రెండు ఇక్కడకు అట్టే దూరంలేని పెద్దాపురం, పులిమేరులలో ఏర్పరచబడ్డాయి. మన రాష్ట్రంలో వాక్యూం పాన్ ఫ్యాక్టరీల అవసరాలుపోను చెఱకు విస్తారంగా మిగిలిపోతుంది. కాబట్టి ఇక్కడ చిన్న చిన్న ఖండసరి కర్మాగారాల స్థాపనకు చాల అవకాశం వుంది. అయితే ఇటీవల యీ పరిశ్రమపై ఎక్సైజు సుంకం విధించటంవల్ల దీని అభివృద్ధి వేగం తగ్గింది. విద్యుచ్ఛక్తి సెంట్రిఫ్యూగల్ యంత్రాలను వాడే కుటీర యూనిట్లు కూడా యీసుంకం క్రిందకు కొనిరాబడ్డంతో వాటి అభివృద్ధి కుంటుపడింది. ఇది ఇప్పుడీ పరిశ్రమను ఎదుర్కొనే తీవ్ర సమస్య. ఈ సమావేశం (1) ఎక్సైజు సుంకం వసూలు, (2) చిన్న చిన్న ఫ్యాక్టరీ యూనిట్ల స్థాపనల సమస్యను జాగ్రత్తగా పరిశీలించి తగిన సిఫార్సులు చేస్తుందని నమ్ముతాను."

మంత్రిగారు తమ ప్రసంగాన్ని ముగిస్తూ ఇలా అన్నారు.—

"బెల్లం, ఖండసరి పరిశ్రమవంటి వికేంద్రీకృత కుటీర పరిశ్రమలే గ్రామీణప్రజానీకానికిలాభకరమైన పని కల్పించగలవు. అఖిలభారత ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్, కమ్యూనిటీ ప్రాజెకు అభివృది కార్యక్రమాల ధర్మమా అని దేశంలో పల్లెప్రాంతాలు సత్వరంగా పరిణామం చెందుతున్నాయి. గ్రామాలలో ప్రశాంతమైన పారిశ్రామిక విప్లవం జరుగుతున్నదని సైతం అనవచ్చు. ఉదాహరణకు, ఉత్పత్తి హెచ్చుదలకై మామూలు రాట్నానికి బదులు అంబర్ చర్ఖా ప్రవేశపెట్టబడింది. అలాగే గ్రామీణ కుమ్మరి, నూనెగానుగ వ్యాపారి, చర్మకారుడు, బెల్లం తయారీదారుల సామర్థ్యం క్రమంగా అభివృద్ధి పరచబడుతున్నది. కాబట్టి చిన్నరకం పరిశ్రమలు, కుటీర పరిశ్రమల వస్తువులపట్ల అభిరుచి కలిగించి వాటి వాడకాన్ని ప్రోత్సహించటానికి తగిన మార్గాలను అన్వేషించమని మీకు చెబుతున్నాను"

## సహకార ప్రాతిపదిక.

బెల్లం, ఖండసరి పరిశ్రమను సహకార ప్రాతిపదికపై అభివృద్ధి చేయవలసిన అవసరాన్ని గురించి కేంద్ర సమాజాభివృద్ధి, సహకార ఉపమంత్రి శ్రీ బి. యస్. మూర్తి నొక్కి చెప్పారు. ఆయన ఇంకా ఇలా అన్నారు.—

"సహకార విధానంలో విక్రయ సౌకర్యాలను పెంపొందించగల అపెక్సు సంఘాలను రాష్ట్రస్థాయిలో ఏర్పాటు చేయమనికూడా మీకు చెబుతున్నాను. ఏ రాష్ట్రంలోను బెల్లం, ఖండసరి అపెక్సు మార్కెటింగు సొసైటీ వున్నట్టు నాకు తెలియదు. ఈ సంఘాలు యీ పరిశ్రమకు కావలసిన ఆధునిక పరికరాల తయారీలోకూడా తోడ్పడతాయి. ఈ అపెక్సు సంఘాల ఫెడరేషన్ ఏర్పాటుకుగల అవకాశాలను గురించికూడా మీరు ఆలోచించవచ్చు. అది యీ పరిశ్రమ అభివృద్ధికి ఖాదీ, గ్రామ పరిశ్రమల కమిషన్ సహాయాన్ని సాధించగలుగుతుంది. ఈ పనిలో చాలభాగం సహకార సూత్రాలపై జరగాలి. సహకారం లాభాలను గురించి నేను వేరే నొక్కి చెప్పనవసరంలేదు. సన్నకారు రైతు, దేశవాళీ చేతిపనివాడు, చాలీచాలని పనిగల గ్రామీణులకు సహకారం ఆశాజ్యోతి కాగలదు. భారతదేశ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా అభివృద్ధి కాలేదు. కాని దేశానికి కావలసినంత మానవబలగం, వస్తుసంపదలు వున్నాయి. కనుక సత్వరం చక్కని సహకార సంఘాలద్వారా గరిష్ఠ లాభాలను పొందాలి. కాబట్టి యీ పరిశ్రమను అభివృద్ధిపరచి రైతుల జీవన ప్రమాణాన్ని హెచ్చించటానికై అశేషావకాశాలుగల యీ అస్త్రం పూర్తి వినియోగానికి తగు మార్గాల నేర్పరచమని మీకు చెబుతున్నాను."



# పాలేరు - బిట్రగుంట పథకం

పాలేరు నెల్లూరు జిల్లా కంధుకూరు తాలూకాలో ప్రవహించే చిన్ననది. ఇది తూర్పు కనుమలలోపుటి బంగాళా ఖాతంలో కలుస్తుంది. ఈ నదిపై ఆనకట్టలు, జలాశయాల నిర్మాణానికై యిదివరలో పెక్కు పథకాలను గురించి ఆలోచనలు జరిగినా, యీ నది నీటిని నీటి పారుదల ప్రయోజనాలకు వినియోగించుకోటానికి యింత వరకు గట్టి కృషి జరుగలేదు. తొలిపంచవర్ష ప్రణాళిక కాలంలో 48 చ॥ మై॥ అరగాణితో పాండువగండి జలాశయం నిర్మించబడింది. అది యిప్పుడిప్పుడే ఫలితానికి వస్తున్నది.

కాబట్టి, యిటీవల ప్రారంభింపబడిన కొత్తపాలేరు-బిట్రగుంట పథకం యీ నదిపై రెండవది అన్నమాట; బహుశా యిదే ఆఖరుదికూడా. తాలూకా తూర్పు ప్రాంతాలలో బిట్రగుంట, పాకాల, బింగినపల్లి, సోమరాజు పల్లిలలో చెరువులు వున్నాయి. నిలకడ లేని వానలపై ఆధారపడుతూ వరాభావం వల్ల తరుచు ఆశాభంగం పొందే రైతాంగం నీటి పారుదల ప్రధాన వనరులుగా యీ చెరువులపై ఆశలు పెట్టుకుని వుంటుంది.

ఈ చెరువులకు పాలేరు నది నీటిని అందచేయాలని రైతులు చాల కాలం క్రిందటనే 1914 లోనే ఆందోళన ప్రారంభించారు. 22-10-1925 తేదీగల ప్రభుత్వ ఉత్తర్వులో 14 మైళ్ల పైన వెంగలాపురంలో జలాశయ నిర్మాణాన్ని విరమించిన పిమ్మట పాలేరు పథకం విషయంలో మరి కొంత పరిశోధన జరిగింది. పెక్కు పథకాలు తయారుచేయబడినవి. 1925 నుంచి 1952 వరకు పరిశోధనలు జరుపబడినవి. తుదకు రూ. 19,50,000 అంచనా ఖర్చుతో ప్రస్తుతం పథకం అమలుకు నిర్ణయించబడింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద మధ్యరకం ప్రాజెక్టులలో ఒకటిగా ప్రభుత్వం ఈ పథకాన్ని మంజూరు చేసింది.

ఈ పథకం ప్రకారం కందుకూరికి 6 మైళ్ల దూరంలోగల జిల్లేలమూడి గ్రామానికి సమీపంలో పాలేరు నదిలో 900 అ. ఆనకట్ట నిర్మించబడుతుంది. బిట్రగుంట చెరువుకి నీటి సరఫరాకై $5\frac{1}{2}$ మై. నిడివిగల కాలవ త్రవ్వబడుతుంది. అక్కడినుంచి నీరు రాజు, చిన్న, పెద్దపాకాల, బింజినపల్లి గ్రామాలలోగల చెరువులకు సరఫరా చేయబడుతుంది. ఈ ప్రాజెక్టు క్రింద అదనంగా 2,458 ఎకరాలకు నీటి పారుదల లభిస్తుందని, ప్రస్తుతపు ఆయకట్టు 2,372 ఎకరములు అభివృద్ధి కాగలవని అంచనా. ఈ ప్రస్తుతపు ఆయకట్టులో ఆయా చెరువుల క్రింద (అదనపు నీటి తీరువ క్రిందగల ప్రాంతంకూడా చేరివుంది.) ఈ పథకంవల్ల నీరు లభించే చెరువులకు కొత్త తూములు నిర్మించబడతాయి.

సంకల్పించిన ఆనకట్ట స్థలంవద్ద ఈ నది అరగాణి 811 చ. మైళ్లు. జూన్ తరువాత సరఫరా కాలవద్వారా చెరువులకు లభించే నీటితో మొత్తం 4,830 ఎకరాలు సాగు కాగలవు. రైతులు వ్యవసాయ పనులను ఏటా జూలైలో ఆరంభించుకోవచ్చు. సరఫరా కాలవ ప్రవాహశక్తి 100 క్యూసెక్కులు ఉంటుంది. ఈ నీరు అంచనావేసిన మొత్తం భూమి 4,830 ఎకరాలకు చాలు.

## ముఖ్యాంశాలు

**ఆనకట్ట :**

| | | |
|---|---|---|
| దీర్ఘాంశం | ... | 79°—54′ |
| అక్షాంశం | ... | 15°—17′—30″ |
| పొడవు | ... | 900 అ. |
| పైమట్టం వెడల్పు | ... | 5 అ. |
| ఎత్తు | ... | 8·25 అ. |
| మట్టం | ... | + 42·25 |
| వరద ప్రవాహం | ... | 87,000 |

**గొయ్యి తూములు :**

| | | |
|---|---|---|
| 4 (నెం.) | ... | 6′—0″+8′—9″ |
| మట్టం | ... | + 33·50 |
| ప్రధాన తూములు | ... | 4 (నెం.)×4′×3′ |
| మట్టం | ... | + 39·00 |
| శక్తి | ... | 120 క్యూసెక్కులు |

కాలువ :—నిడివి బిట్రగుంట చెరువు వరకు 8 మై. 4 ఫ.

**లాభాలు :**

ఈ పథకంవల్ల 1,822 టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా పండగలవని అంచనా.

17-7-58 తేదీగల ఉత్తర్వులో ప్రభుత్వం ఈ పథకానికి పనులకు రూ. 14,05,500 లేక ప్రత్యక్ష పరోక్ష ఖర్చులతో కలుపుకుని రూ. 16,00,000 అంచనాను మంజూరు చేసింది.

పెట్టుబడిమీద 11·2 శాతం ప్రతిఫలం ముడుతుంది.

# జిల్లాల వార్తలు

## అనంతపురం

సహకార వ్యవసాయం.—ఉరవకొండ అభివృద్ధి కేంద్ర కొట్టాల పల్లి గ్రామ యువజన క్లబ్బు సభ్యులు 14 ఎకరాలభూమిని కౌలుకు తీసికొని సహకార వ్యవసాయాన్ని ప్రారంభించారు.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రం.—సింగనమల అభివృద్ధి కేంద్ర తరిమెల గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రనిర్మాణానికై శాసన సభ సభ్యుడు శ్రీ టి. రామచంద్రారెడ్డి, శ్రీ టి. ఆదినారాయణరెడ్డి గారలు రూ 5,000 లు రొఖ్ఖాన్ని, 2 ఎకరాల భూమిని ఇచ్చారు. నిర్మాణం పని జరుగుతున్నది.

కొత్తపాఠశాలా భవనాలు.—1959 జూలైలో గోరంట్ల అభివృద్ధి కేంద్ర గుమ్మయ్య గారిపల్లి, మల్లపల్లిలలో కొత్త పాఠశాలా భవనాలను జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. ఆర్. రామమూర్తి, ఐ. ఎ. ఎస్. ప్రారంభించారు.

గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం.—18-7-1959 న శాసన సభ సభ్యుడు శ్రీ ఎన్. సి. శేషాద్రి రాయదుర్గ అభివృద్ధి కేంద్రంలో హీరేహల్‌లో గ్రామ సహాయకుల శిక్షణాశిబిరాన్ని ప్రారంభించారు. ఈ ఉత్సవానికి జిల్లా కలెక్టరు అధ్యక్షత వహించారు.

గోరంట్ల, కొడిగెనహల్లి, రాయదుర్గ అభివృద్ధి కేంద్రాలలో ప్రణాళికా ప్రచార వారోత్సవాలు జరిగాయి.

## చిత్తూరు

శిక్షణా శిబిరం.—30-7-1959 నుంచి 1-8-1959 వరకు కార్వేటినగరం మొదటి అంచె అభివృద్ధి కేంద్రం అధ్వర్యాన చెంచుగుడి గ్రామంలో వ్యవసాయంలో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నడుపబడింది.

## గుంటూరు

అప్రోచ్ రోడ్డు.—బాపట్ల అభివృద్ధి కేంద్రంలో మరుప్రోలు వారి పాలెం శివారు మద్దిబోయినవారిపాలెం గ్రామస్థులు శ్రమదానంతో 7 ఫర్లాంగుల పొడవున రోడ్డును నిర్మించి తమ గ్రామాన్ని బాపట్ల మెయిన్ రోడ్డుతో కలుపుకున్నారు. శ్రమదానంలో గ్రామస్థులందరూ పాల్గొన్నారు.

శ్రమదాన కార్యక్రమాలు.—నాదెండ్ల సమితి అభివృద్ధికేంద్రంలో వేలూరు, దిండినపాడులలో రెండు శ్రమదాన కార్యక్రమాలు ఏర్పాటుచేయబడినవి. శ్రమదానంలో దాదాపు గ్రామస్థులంతా పాల్గొన్నారు.

వెల్లటూరు మేలా.—7-6-1959 నుంచి 9-6-1959 వరకు ఐపూరు అభివృద్ధి కేంద్ర వెల్లటూరులో గొప్ప మేలా జరిగింది. ఆ సందర్భంలో ఇంచుమించు 3,000 మంది ప్రజలు వచ్చారు. గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం కూడా ఏర్పాటు చేయబడింది. అయిదుగురు గ్రామ సహాయకులకు శిక్షణ ఇవ్వబడింది.

కొత్త ప్రాథమిక పాఠశాలలు.—30-7-1959 న. పల్లపట్ల మొదటి అంచె కేంద్రం కోవూరివారిపాలెంలో ఆదర్శప్రాథమిక పాఠశాల ప్రారంభించ బడింది.

అదే కేంద్రంలో పల్లిపాలెంలో కొత్తగానిర్మించబడిన బోర్డు ప్రాథమిక పాఠశాలాభవనం తెరువబడింది. ఈ భవనానికి జిల్లా బోర్డు రూ 5,000 అభివృద్ధి కేంద్రం రూ 3,000 శ్రీ నాగళ్ల వెంకట సుబ్బయ్య రూ 2,000 విరాళ మిచ్చారు.

11-6-1959 న మంగళగిరి అభివృద్ధి కేంద్రం చినవడ్లపూడిలో ఒక బహుళార్థ సాధక సహకార సంఘం ఏర్పాటు చేయబడింది.

మంగళగిరి కేంద్రం నిడమర్రు గ్రామంలో 7-6-1959 నుంచి మగవారికై వ. వి. కేంద్రం నడుపబడుతున్నది.

మంగళగిరి తదితర అభివృద్ధి కేంద్రాలలో మంచి ఉత్సాహంతో ప్ర. ప్ర. వారోత్సవాలు జరిగాయి.

హైదరాబాదు.—భారత వ్యవసాయ పరిశోధనా సంఘం అధ్వర్యాన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద హైదరాబాదులో నెలకొల్పబడిన క్రాస్ బ్రీడింగ్ కేంద్రం పరిశోధనా ప్రాజెక్టు అయివున్నది. దానిలో అభివృద్ధి కార్య కలాపాలు కూడా చేరివున్నాయి. ఈ కేంద్రం చక్కగా పనిచేస్తున్నది. దాని ప్రధాన కేంద్రం హైద్రాబాదు సితారాంపేట పశువైద్యశాలలో ఉన్నది. ఉపకేంద్రాలు సికింద్రాబాదు, ఉప్పల్, రాయదుర్గం, షంషాబాదులలో ఉన్నాయి.

తాండూరు, మొదటి అంచె కేంద్రం, రాజేంద్రనగరం సమాజాభివృద్ధి కేంద్రాలలో ప్ర. ప్ర. వారోత్సవాలు జరుపబడ్డాయి

ఖమ్మం రత్నాం చెర్వు.—25-7-1959 న పబ్లిక్ వర్క్సు శాఖ మంత్రి శ్రీ జె.వి. నర్సింగరావు గౌరవరంలో రత్నాం చెర్వును ప్రారంభించారు. ఈ చెర్వునీటితో 1,200 ఎకరాలకు నీటి

పారుదల కల్పించాలని సంకల్పించబడింది ఆయకట్టును పూర్తిగా అభివృద్ధి పరచుకొని నిటినిసద్వినియోగం చేసుకొమ్మని మంత్రిగారు రైతులనుద్బోధించారు. ఈ సందర్భంలో జిల్లా కలెక్టరు శ్రీ సయ్యద్ హషీమాలీ, శ్రీ జంగం వెంగళరావు ప్రభృతులు మాట్లాడారు

శ్రమదానం —ఖమ్మం మాఖిల్లగూడెం బజారు వాస్తవ్యులు వందగజాల రోడ్డును నిర్మించి పాడైపోయిన వంతెన నొకదానిని బాగుచేశారు

## కృష్ణా

ప్రాథమిక ఆరోగ్య కేంద్రం —1959 వ సం॥ ఆగస్టు 2 వ తేదీన కృష్ణా జిల్లా వైద్యాధికారి డాక్టరు సి వి. యతిరాజులు బంటుమిల్లి అభివృద్ధి కేంద్రం చినపండ్రక గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని ప్రారంభించారు ఈఉత్సవానికి శా స స శ్రీ పి. పమిడేశ్వరరావు అధ్యక్షత వహించారు. ఈ సందర్భములో జిల్లా ప్రచార అధికారి శ్రీ వి రామలింగస్వామి ప్రసంగించారు.

హరిజన్ డే —1959 వ సం॥ జూలై 30 వ తేదీన బందరు తాలూకా బల్లిపర్రు గ్రామంలో హరిజన్ డే జరుపబడింది క్రొత్తగా నిర్మించబడిన గృహాన్ని ప్రారంభించడానికై సాయంకాలం జిల్లా కలెక్టరు శ్రీ బి సి గంగోపాధ్యాయ, ఐ ఎ ఎస్ హరిజన గృహాలను సందర్శించారు. ఈ సందర్భంలో దేవాలయ ప్రవేశం కూడా జరిగింది. హరిజనులు సవర్ణ హిందువులు కలసి దేవాలయంలోనికి వెళ్లారు కలెక్టరు అధ్యక్షతన హరిజనవాడలో బహిరంగ సభ జరిగింది. అప్పుడు తూర్పు కృష్ణా హరిజన సేవక సంఘం అధ్యక్షుడు శ్రీ కొడాలి ఆంజనేయులు, తదితరులు ప్రసంగించారు బల్లిపర్రు పంచాయతీ అధ్యక్షుడు వందన సమర్పణ చేశారు.

## మహబూబునగరం

ఆదర్శ చర్మకార కేంద్రం —1959 వ సం॥ జూలై 24 వ తేదీన జిల్లా కలక్టరు శ్రీ బి వెంకటరత్నం ఐ ఎ. ఎస్., షయినాపల్లిలో ఆదర్శ చర్మకార కేంద్ర నిర్మాణానికి శంకుస్థాపన చేశారు,

గ్రామదాన కార్యక్రమం —సమన్వయ పూర్వకమైన శ్రమదాన కార్యక్రమం అమలుకై ఎన్నబడిన జడ్చెర్ల పూర్వ విస్తరణ కేంద్రం భూతపురం గ్రామ శివారు నర్సింగపురం గ్రామంలో ప్రజల స్థితిగతులను స్వయంగా తెలుసుకొనటానికై జిల్లా అధికారులు ఆ గ్రామాన్ని దర్శించారు. రూ 15,000 అప్పు, రూ 10,000 గ్రాంటు మంజూరు చేయబడినవి. జి. ఎ. బిజ్జనపల్లి అ. కేంద్రి షాయినపల్లిలో గ్రామ పంచాయతీ కమిటీని ప్రారంభించారు.



1959 వ సం॥ అగస్టు 28 వ తేదీన అధిక వర్షాలవల్ల పొంగిపొర్లుతున్న "పాకాల చెరువు" చెరువు (వరంగల్లు జిల్లా కటాచ్‌పూర్)



1959 వ సం॥ ఆగస్టు 28 వ తేదీన వరంగల్లు జిల్లా రామప్ప సరస్సు సమీపంలో వల్లపల్లి గ్రామంలో వరద దృశ్యం.

గద్వాల మొదలగు ప్రదేశాలలో ప్ర. ప్ర. వారోత్సవం జరుప బడింది.

## మెదక్

అంబర్ చర్ఖా శిక్షణా కేంద్రం.—రామాయణపేటలో అ. చ. శి. కేంద్రం ఒకటి ప్రారంభించబడింది.

కుటుంబానికొక ప్రణాళిక.—"కుటుంబానికొక ప్రణాళిక" పథకం అమలు నిమిత్తం నిర్ణయించబడిన తొగరుపల్లి గ్రామం సర్వే చేయ బడింది. ఈ గ్రామంలో మొత్తం మాగాణి భూమిలో 80 శాతానికి పైగా జపాను పద్ధతి సాగుక్రింద వున్నది. అధికాహారోత్పత్తి కార్యక్రమంక్రింద కొత్తబావులు నిర్మించబడినవి.

5 గదుల పాఠశాలా భవనం ఒకటి, ఒక కమ్యూనిటీ హాలు నిర్మించబడినవి. విరాళం ప్రాతిపదికపై ఒక అప్రోచ్ రోడ్డు నిర్మించబడింది ఒక ధాన్యం బ్యాంకు నెలకొల్పబడింది ఈ గ్రామంలో 12 కుటుంబాలు కలసి 120 ఎకరాల భూమిలో సమిష్టి వ్యవసాయం చేస్తున్నది

## నల్గొండ

పారిశ్రామిక సహకార సంఘాలు.—నల్గొండ జిల్లా పారిశ్రామిక సహకార సంఘాల తొలి సమావేశం నల్గొండలో శ్రీ జి ఎస్ రెడ్డి అధ్యక్షతన జరిగింది ఈ సమావేశాన్ని జిల్లా కలక్టరు శ్రీ శ్రావణకుమార్, ఐ ఎ ఎస్ ప్రారంభించారు. ఈ సమావేశంలో, రమారమి 24 పరిశ్రమలకు ప్రాతినిధ్యం వహించే 100 పారిశ్రామిక సహకార సంఘాల ప్రతినిధులు, జిల్లా అధికారులు, అనధికారులు పాల్గొన్నారు.

## శిక్షణ-ఉత్పత్తి కేంద్రం

చెర్లపల్లి ఆదర్శ గ్రామంలో రూ 8,000 ఖర్చుతో నిర్మించబడిన సాంఘిక సంక్షేమ శిక్షణ-ఉత్పత్తి కేంద్రం భవనాన్ని 1959 వ సం॥ జూలై 26 వ తేదీన జి క ప్రారంభించారు ఈ సందర్భంలో జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు శ్రీ జి. ఎస్. రెడ్డి, శ్రీ కె చిన వెంకట రామారావు గారలు ప్రసంగించారు

పంచాయతీ అధ్యక్షుల శిక్షణ —ఇటీవల నల్గొండలో పంచాయతీ నిర్వహణలో 50 మంది పం అధ్యక్షులకు శిక్షణ యివ్వబడింది గ్రామ పంచాయతీ అధ్యక్షులకు క్రమ ఘట్టాలలో శిక్షణ నివ్వటానికి ఒక కార్యక్రమం రూపొందించబడింది దాని ప్రకారం, నల్గొండ, నక్రేకల్, నార్కేటపల్లి, నారాయణపురం చందూరులు శిక్షణా కేంద్రాలు కాగలవు

ప్రసూతి వార్డు —హుజూరు నగరంలో కొత్తగా నిర్మించబడిన ప్ర వార్డును 1959 వ సం॥ ఆగస్టు 2 వ తేదీన జి క ప్రారంభించారు ఈ భవనం రూ 18,000 అంచనా ఖర్చుపై స్థానికాభివృద్ధి పనుల క్రింద నిర్మించబడింది ఇందులో నాలుగోవంతును ప్రజలు యిచ్చారు.

రోడ్డు ఆనకట్ట.—హుజూరు నగరం తాలూకా చిలుకూరులో స్థానికాభివృద్ధి పనులక్రింద నిర్మించబడిన మిక్కిలి పెద్ద రోడ్డు ఆనకట్టను జి. క. ప్రారంభించారు. ఇది రూ 20,000 తో నిర్మించబడింది. ఈ ఖర్చులో నాలుగోవంతుకంటె పైగా గ్రామస్థులు ముఖ్యంగా శ్రమ, వస్తు రూపాలలో భరించారు ఈ సందర్భంలో శా. స. స. శ్రీ దొడ్డా నరసయ్య, పంచాయతీ కమిటీ అధ్యక్షుడు శ్రీ డి. నారాయణరావు గారలు ప్రసంగించారు.

కమ్యూనిటీ హాలు.—హుజూరు నగరం తాలూకా లింగగిరి గ్రామంలో కమ్యూనిటీ హాలును జిల్లా కలక్టరు ప్రారంభించారు. ఇది రూ 9,000 అంచనా ఖర్చుపై స్థానికాభివృద్ధి పనుల క్రింద నిర్మించబడింది. ఇందులో రూ 2,500 ప్రజలు ఇచ్చారు. లింగగిరి పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ అప్పారావు కలక్టరుకి స్వాగతం చెప్పారు.

గ్రామసహాయకులశిక్షణ శిబిరం.—1959 జూలై 22 నుంచి 24 వరకు చౌటుప్పల్ అభివృద్ధి కేంద్రం రెడ్లరేపాక గ్రామంలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం జరిగింది. గ్రామస్థులు తరగతులకు ఎంతో శ్రద్ధతో హాజరయి నూతన వ్యవసాయ పద్ధతులను గురించి తెలుసుకున్నారు.

సూర్యాపేట మొదటి అంచె కేంద్రం.—సూర్యాపేట మొదటి అంచె కేంద్రం నల్గొండ జిల్లాలో ఉత్తమమైన అభివృద్ధి కేంద్రాలలో రెండవదిగా నిర్ణయించబడింది. ఇక్కడ అభివృద్ధి వివిధ రంగాలలో తగినంత ప్రగతి సాధించబడింది. మూడు గ్రామాలు అనగా బేతోలు, పెనపాడు, అంజపూరులు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం స్థాపనకు రూ 10,000 రొఖ్ఖం, 2 ఎకరాల స్థలం ఇస్తామన్నారు.

కొత్తతపాలకార్యలయాలు.—రామన్నపేట తాలూకా కక్కిరేణి గ్రామంలో ఒకటి, దేవరకొండ తాలూకా తందేదరపల్లిలో ఒకటి రెండు కొత్తతపాలాకార్యాలయాలు తెరువబడినవి.

చౌటుప్పల్ అభివృద్ధి కేంద్రలోను, తదితర ప్రాంతాలలోను ప్ర. ప్రచార వారోత్సవం జరుపబడింది.

## నిజామాబాదు.

భిక్కూరు హైస్కూలు.—1959 వ సం॥ జూలై 28 వ తేదీన జిల్లా కలక్టరు శ్రీ జి. ఎన్. చెట్టి భిక్కూరు ఉన్నత పాఠశాలలో 10 వ తరగతిని ప్రారంభించారు. అభివృద్ధి కార్యక్రమం ఆరంభంలో యీ గ్రామంలో రూ 6,000 తో ప్రాథమిక పాఠశాలాభవనం నిర్మించబడింది. ఈ ఖర్చులో నాలుగోవంతును ప్రజలు భరించారు. ఆ తరువాత దీనికి ప్రజలు రూ 14,000 వరకును, గ్రామపంచాయతీ సమితీ రూ 7,000 వరకును యిచ్చి 6 వ తరగతి నుంచి 10 వ తరగతి వరకు తరగతులను ప్రారంభించటానికి వీలు కల్పించారు. భవనం విస్తరణకై మరొక రూ 7,000 ఇవ్వబడినవి. ఈ విధంగా ఆ ప్రాథమిక పాఠశాల నేడు ఉన్నత పాఠశాలగా అభివృద్ధి పొందింది. ఈ పాఠశాల త్వరలోనే పూర్తిగా వికాసంచెందిన ప్రభుత్వోన్నత పాఠశాలగా రూపొందగలదన్న ఆశాభావాన్ని జిల్లా కలెక్టరు తమ ప్రసంగంలో వ్యక్తం చేశారు. ప్రారంభోత్సవ సందర్భములో బన్సవాడ పంచాయతీ సమితి కేంద్రం అధ్యక్షుడు శ్రీ ఎన్. లింగయ్య గుప్త, పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీభూమరాజుగారలు ప్రసంగించారు.

## విశాఖపట్నం.

క్రొత్త అభివృద్ధి కేంద్రం.—1959 వ సం॥ జూలై 21 వ తేదీన జిల్లా కలక్టరు శ్రీ ఐ.జె. నాయుడు ఐ.ఎ.ఎస్. కొత్తవలసలో పూర్వవిస్తరణ కేంద్రాన్ని ప్రారంభించారు. ఈప్రారంభోత్సవానికి శాసన సభ సభ్యుడు శ్రీ జి. జగన్నాధరాజు అధ్యక్షత వహించారు. ఈ కేంద్రలో 56,000 జనాభా, 100 చదరపు మైళ్ల విస్తీర్ణం గల 56 గ్రామాలువున్నాయి. అభివృద్ధి కార్యక్రమంలో ప్రజల పాత్రను గురించి శాసన సభ సభ్యుడు శ్రీ కె. వి. ఎస్. పద్మనాభ రాజు, శాసన మండలి సభ్యుడు శ్రీ జి. బి. అప్పారావు, శ్రీ సి. హెచ్. అప్పయ్య పంతులు, శ్రీ ఎ. చంద్రారావు గారలు ప్రసంగించారు. అంతకుముందు పంచాయతీ అధ్యక్షుడు శ్రీ జి. సత్యం నాయుడు సభికులకు స్వాగతం చెప్పారు. జిల్లా కలక్టరు హరిజనవాడలో ఒక రోడ్డుపని ప్రారంభించారు. అభివృద్ధి కేంద్ర ప్రారంభానికి సూచనగా ఆయన శ్రమదానంలో పాల్గొన్నారు.

అరకులోయ అభివృద్ధి.—అరకులోయ, టౌన్‌షిప్ పథకాల శీఘ్రాభివృద్ధి విషయంలో అభిప్రాయసేకరణకై జిల్లా కలెక్టరు జిల్లాలో ప్రముఖ పౌరుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఈ చర్చలో ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు శ్రీ వి. ఎస్. కృష్ణ, రిజిష్ట్రారు శ్రీ కె. వి. గోపాలస్వామి, ప్రిన్సిపాల్ డా. సి. మహాదేవన్, సాంఘిక, నిరోధక వైద్య ప్రొఫెసర్ డా. ఎస్. దక్షిణామూర్తి, ప్రొఫెసర్ కె. సుబ్రహ్మణ్య నాయుడు (సహకారం ప్రొఫెసర్) పా. సభ్యుడు శ్రీ పి. వి. జి. రాజు గారలు పాల్గొని తమ తమ అభిప్రాయాలు ఇచ్చారు. అరకులోయ టౌన్ షిప్పు పథకం అభివృద్ధికై 11 మంది సభ్యులతో ఒక ఉప సంఘం నియమించ బడింది.

అస్సాం వరద రక్షణ నిధి.—ఈ జిల్లాలో అస్సాం వరద రక్షణ సంఘం ఇంతవరకు వస్తురూపంలో సేకరించినవి కాక రూ 4,837—74 రొఖ్ఖాన్ని సేకరించింది.

పాఠశాలలకు విరాళాలు.—వడ్డాది అభివృద్ధి కేంద్రంలో కొట్నబిల్లి గ్రామానికి చెందిన మన్సాదార శ్రీ అసరి కనకం ఆగ్రామంలో ప్రాథమిక పాఠశాలనిర్మాణానికై 1 ఎ. 10 సెంట్ల భూమిని జిల్లా బోర్డుకు విరాళమిచ్చాడు. అదే కేంద్రంలో గంటికొర్లం గ్రామ వాస్తవ్యుడు శ్రీ సామల చిన్నయ్య దొర ప్రాథమిక పాఠశాలకి ఒక ఎకరం భూమిని విరాళమిచ్చాడు.

వడ్డాదిలోగల బ్రాంచి పోస్టాఫీసు 1959 వ సం॥ జూన్ 15 వ తేదీనుంచి సబ్ పోస్టాఫీసుగా అభివృద్ధి చేయబడింది.

పశ్చిమ గోదావరి.—1959 వ సం॥ జూలై 12 నుంచి 18 వరకు ఆకివీడు కేంద్రం అన్నిగ్రామాలలోను ప్ర. ప్ర. వారోత్సవం జరుపబడింది.

# ప్రశ్నోత్తరావళి

**99 వ ప్రశ్న.**—(శ్రీ ఎస్. నాగరత్నం, రాజ్‌పల్లి)

15 యెకరాల భూమికి నీటి పారుదల లభింప చేయగల బావికి అమర్చే గొట్టం పరిధి యెంత వుండాలి? అడుగు ఒకటికి యెంత ఖర్చు కాగలదు? హా. ప. యెంత వుండాలి? వాయిదాలపై తీర్చుకునే పద్ధతిలో ప్రభుత్వం అప్పులు యిస్తుందా? ఇస్తే యే శాఖ యిస్తుంది?

జవాబు.—ఈ ప్రశ్న చాలా స్థూలమయినది. 15 యెకరాల భూమికి నీటి పారుదల లభింపచేయటానికి తగిన పంపింగు సెట్టు యెన్నిక దిగువ విషయాలపై ఆధారపడి వుంటుంది. 1. బావి వ్యాసం, నీటి కాలమ్, 2. బావిలో యెప్పుడూ వుండే నీటిమట్టం, 3. తోడవలసిన మొత్తం యెత్తు, 4. పండించవలసిన పంట వగైరా.

నీటి సరఫరాకు ఇంజన్ హా. ప. విషయం, అది పై నాలుగు అంశాలమీద ఆధారపడి ఉంటుంది.

గొట్టాలు, ఇంజనుల ఖరీదు మొత్తం దగ్గరగా రూ 5,000 వుంటుంది.

ఆయిల్ ఇంజన్ పంపింగు సెట్టును తక్కావి అప్పుపై వాయిదాల పద్ధతిమీద వ్యవసాయ శాఖనుంచి పొందవచ్చును.

**100 వ ప్రశ్న.**—(శ్రీ డి. వి. రమణ, శ్రీనివాసపురం.)

నల్గొండ జిల్లాలో వ్యవసాయానికై ట్రాక్టర్లు మంజూరు అయినవా? అవి సామాన్యులందరికి అందుబాటులో వున్నాయా?

జవాబు.—1958 మార్చి, ఏప్రిల్ నెలల్లో వ్యవసాయ శాఖ వరంగల్లు జిల్లా (కాని నల్గొండ జిల్లా కాదు) జనగాం తాలూకాలో ట్రాక్టరు దున్నకం పనిని చేపట్టింది. ఆ తరువాత ఆ ప్రాంతంలో ట్రాక్టర్లకు తగిన కార్యక్రమం లేనందున అవి యితర జిల్లాలకు తరలించబడినవి.

దున్నవలసిన భూమి విస్తారంగా వున్నప్పుడే వ్యవసాయ శాఖ ట్రాక్టర్లను ఉపయోగిస్తుంది. చిన్న చిన్న భూఖండాల నిమిత్తం ట్రాక్టర్లను వాడితే నష్టం కాబట్టి కనీసం 5,000 యెకరాలు అయినా లేనిదే యీ శాఖ వాటిని ఉపయోగించదు.

**101 వ ప్రశ్న.**—మెట్రిక్ పద్ధతిలో కిలోగ్రాముకి, గ్రాము తూకములకు షడ్భుజాకారమెందుకు నిర్ణయించబడింది?

జవాబు.—ప్రస్తుతం గుండ్రని, నలుచదరం వగైరా ఆకారాల తూకములు వున్నవి. కాబట్టి, యీ ఆకారాలలో వేటినైనా నిర్ణయించినట్లయితే ప్రస్తుతపు తూకపు రాళ్లకు, పాతవాటికి తేడా తెలియక తికమక కలిగి వ్యాపారంలో మోసానికి యెక్కువ ఆస్కారం కలుగుతుంది. కనుక యీ తూకపు రాళ్లకు కేంద్రప్రభుత్వం షడ్భుజాకారాన్ని నిర్ణయించింది.

**102 వ ప్రశ్న.**—అధికార అంచనాల రీత్యా యిప్పుడు మన దేశంలో నిరుద్యోగుల సంఖ్య యెంత?

జవాబు.—ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆరంభంనాటికి ఇండియాలో రమారమి 50 లక్షలమంది నిరుద్యోగులున్నట్లు అంచనా వేయబడింది. కాని దేశ జనాభా యేటా పెరుగుతున్నదని భావించబడుతున్నది కాబట్టి, కార్మికబలగం సాలీనా యించుమించు 20 లక్షలు పెరుగుతుంది. అనగా ప్రణాళికా కాలం సమాప్తినాటికి అనగా 1960–61 నాటికి పూర్తి లైవ్ ఎంప్లాయ్‌మెంటు లేని ప్రజలు యించుమించు $1\frac{1}{2}$ కోట్లు వుండగలరు. ఇందులో చాలీచాలని పనిగల ప్రజలు చేరి లేరు.



# విశేషాలు

## ఉత్తరాది విశ్వవిద్యాలయాలలో తెలుగు.

అలహాబాదు విశ్వవిద్యాలయంలో తెలుగు, తమిళ భాషల బోధనకు యేర్పాటు చేయాలని నిర్ణయించబడినట్టు 1959 వ సం॥ ఆగస్టు 22 వ తేదీన లోక సభలో కేంద్ర విద్యా మంత్రి డా॥ కె. ఎల్. శ్రీమాలి తెలియచేశారు.

కలకత్తా విశ్వవిద్యాలయంలో తెలుగు, తమిళములలో పోస్టు గ్రాడ్యుయేటు కోర్సుల ప్రారంభానికి పథకాలు తయారుచేయబడినవని కూడ ఆయన చెప్పారు.

అలిఘర్, బెనారస్, ఢిల్లీ, బొంబాయి, సౌగార్ విశ్వ విద్యాలయాలలో దక్షిణాది భాషల బోధనకు సంబంధించిన పథకాలు కూడా పూర్తి అయినవని ఆయన చెప్పారు.

## వీరసత్కారం.

ఆంధ్ర ప్రదేశ్ అగ్నిమాపక దళడ్రైవర్ - ఆపరేటర్ శ్రీ తడ్డి సుబ్బారావుకి రాష్ట్రపతి పోలీసు, ఫైర్ సర్వీసెస్ పతకం బహూకరించబడింది. ఇదివరలో ఒకసారి చూపిన ధైర్య సాహసాలకు అతనికి యిదే పతకం యిదివరకే బహూకరించబడింది.

## శ్రీ సుబ్బారావు సాహస గాథ వివరాలు.

క్రితం సంవత్సరం అక్టోబరు 8 న పెన్నానది పొంగి పొర్లుతున్నది. నదిలో నీరు క్రమేణా హెచ్చిపోతున్నది. నెల్లూరు పట్టణం జలమయం కాగల ప్రమాద మేర్పడింది. నది మధ్య లంకలో పశువులను మేపుతున్న కుర్రాడు, అక్కడ మేస్తున్న 30 పశువులు నీటి మధ్య చిక్కుపడి పోయాయి.

శ్రీ సుబ్బారావు యీ పరిస్థితిని చూశాడు. పశువుల కాపరిని రక్షించే సంకల్పంతో వరదను లెక్క చేయకుండా నదిలో కురికాడు. మధ్యలో సుడిగుండంలో పడిపోయాడు. కొంత సేపటికి అతి కష్టం మీద ఒడ్డు చేరుకున్నాడు. అప్పుడతనికి కొంత వరకు స్పృహతప్పిపోయింది.

ఆ కుర్రవాడి రక్షణకై మర్నాటి ఉదయం వరకు చెప్పుకోతగిన కృషి యేమీ జరుగలేదు. శ్రీ సుబ్బారావు మళ్లీ నదిలో కురికాడు. గాలి నింపిన మోటారు ట్యూబు సహాయంతో యించుమించు 2 మైళ్లు ప్రవాహాని కెదురీది ఆ లంకను చేరుకున్నాడు. అక్కడా కుర్రవాడు భయంతో గజ గజ లాడిపోతున్నాడు. ఆ కుర్రవాడిని ఆ ట్యూబుకి కట్టి అతడు తిరుగు ముఖం పట్టాడు. సగం తోవలో మళ్లీ సుడిగుండం అడ్డు వచ్చింది. ఇద్దరూ అందులో చిక్కుకున్నారు.

రెండు గంటలకు పైగా వరద నీటితో హోరా హోరి పోరి చివరకు ఒడ్డు చేరుకున్నారు.

## బహుమతులు.

ఆంధ్ర ప్రదేశ్‌లో కొందరు పోలీసు అధికారుల విశిష్ట కృషికి మెచ్చి 1959 స్వాతంత్ర్య దినోత్సవాన రాష్ట్రపతి పోలీసు పతకాలను బహూకరించారు. వివరాలు యివి. —

### రాష్ట్రపతి పోలీసు, ఫైర్ సర్వీసెస్ పతకం.

1. శ్రీమాడ కృష్ణమూర్తి, ఐ. పి. ఎస్., పోలీసు అసిస్టెంటు ఇనస్పెక్టర్ జనరల్, హైదరాబాదు.
2. శ్రీఇందుగుల శోభనాద్రి నాయుడు, ఐ. పి. ఎస్., నేర పరిశోధన శాఖ క్రైం బ్రాంచి పోలీసు సూపరింటెండెంటు, హైదరాబాదు.

### రాష్ట్రపతి పోలీసు పతకం.

1. శ్రీమహమ్మద్ బదియుద్దీన్, నేర పరిశోధన శాఖ పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు (అఫ్‌టి), హైదరాబాదు.

## సమాజాభివృద్ధి కేంద్రాలలో ఘనా వుద్యోగి పర్యటన.

సమాజాభివృద్ధి కేంద్రాలలో పని జరిగే విధానాన్ని తెలుసుకోటానికై జూలై 29 నుంచి 13 రోజుల పర్యటన కార్యక్రమాన్ని యేర్పరచుకున్న ఘనా వుద్యోగి మిస్టర్ బి. వై. వ్యూసూ ఆగస్టు మొదటి వారంలో రాజేంద్రనగర్, ఇబ్రాహిం పట్నం కేంద్రాలను దర్శించారు. తాను వెళ్లిన చోటల్లా ఆయన బ్లాకు సిబ్బందితోనూ, గ్రామస్థులతోనూ, సహకార సేద్యం వగైరా విషయాలను గురించి మాట్లాడారు. మేడ్చెల్ అభివృద్ధి కేంద్రం నడిపే గ్రామీణ కళలు, వృత్తుల కేంద్రం పట్ల ఆయన యెంతో ఆసక్తి చూపారు.

## హిందీ వున్నత విద్య.

హిందీ మాట్లాడని ప్రాంతాలకు చెందిన విద్యార్థులలో హిందీలో వున్నత విద్యాభ్యాసనాన్ని ప్రోత్సహించటానికై కేంద్ర ప్రభుత్వం యేటా విద్యార్థి వేతనాలను యిస్తుంది. 1958-59 లో ఇవ్వబడిన 110 విద్యార్థి వేతనాలలోను మన రాష్ట్రానికి అందరికంటె యెక్కువగా 29 వచ్చాయి. వివరాలు యివి.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | .. | .. | 29 |
| మద్రాసు | .. | .. | 25 |
| కేరళ | | .... | 24 |
| మైసూరు | ... | ... | 16 |
| బొంబాయి | ... | .. | 5 |
| అస్సాం | ... | ... | 4 |
| పంజాబు | ... | ... | 3 |
| ఒరిస్సా | | .... | 2 |
| పశ్చిమ బెంగాలు | | .. | 1 |
| మణిపూరు | ... | ... | 1 |




# MAP of the CUDDAPAH DISTRICT


REFERENCE
CUDDAPAH District head quarters
RAYACHOTI Division do
PRODDATUR Taluk do
CHITVELU Deputy Tahsildar's station
Chennuru Villages above 5000 inhabitants
Galivedu Other important Villages
Kesapuram Travellers bungalow (D. P. W. Forest & etc)
District boundary
Taluk boundary
Railway line with station (Broad gauge)
State Highways with unbridged sections
Major district roads with unbridged sections
Other district roads with unbridged sections
Other roads with unbridged sections
River, Channel & Bridge.
Canal with lock
Tank Stream
Vertical Hills (Approximate)
G. T. S. and height in feet above sea level
ST. Sirvel Taluk
The Longitudes are referrible to the Greenwich Meridian, taking that of Madras Observatory as 80-14-54 East
RAYACHOTI
RAJAMPET
LAKKIREDDIPALLE
CHITVEL
Nandaluru
Koduru
Chinna Orampadu
Tsundupalle
Chinnamandem
From Kadiri
To Vayalpad
To Chittoor
To Puttur
To Renigunta
C H I T T O O R
A N N
14° 0'
13° 30'
78°
78° 30'
79°
79° 30'



పాతాళగంగ.—శ్రీశైలంలో కొత్త జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు నిర్మించబడబోయే ప్రాంతంలో కృష్ణా నది దృశ్యం.

# ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం



| | |
|---|---|
| వైశాల్యం | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | 3,12,60,133 |
| పురుషులు | 1,57,42,912 |
| స్త్రీలు | 1,55,17,221 |

సగటు వర్షపాతము:

| | |
|---|---|
| ఆంధ్ర ప్రాంతం | 34·6 అంగుళాలు |
| తెలంగాణా | 36·7 ,, |
| అరణ్య ప్రదేశం | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | 1,000 |
| పట్టణాలు | 293 |
| గ్రామాలు | 26,450 |
| పంటలక్రింది ప్రదేశం | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | 66·8 లక్షల ఎకరాలు |
| కౌళ్ళ సంఖ్య | 42,42,655 |
| 1958-59 లో వుత్పత్తి అయినఆహార ధాన్యాలు | 61·56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | 15·5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | 2,072 ,, |
| జిల్లా పెద్ద రోడ్లు | 2,527 ,, |
| జిల్లా ఇతర రోడ్లు | 3,458 ,, |
| పాఠశాలలు | 28,000 |
| కళాశాలలు | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | 31 |
| ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక ప్రమాణం | రూ 175.37 కోట్లు |

1959-60 బడ్జెట్టు:

| | |
|---|---|
| ఆదాయం | రూ 71·29 కోట్లు |
| వ్యయం | ,, 71·66 ,, |
| పెట్టుబడి ఖర్చు | ,, 28·30 ,, |



శ్రీశైలం ప్రాజెక్టు స్థలానికిపోయే మార్గంలో మనోహరమైన లోయ దృశ్యం.